గోయాతో మీరు
త్రుటిలో కొత్త
మనిషి అవుతారు

గోయా టాల్కం పౌడర్లు తుషారంవలె మార్దవంగా
వుంటాయి మృదు పరిమళాలతో మీ స్త్రీత్వానికీ
సోయగానికీ మెప్పు తెప్పిస్తాయి

విలక్షణమైన బ్లాక్ రోజ్ శృంగారాభిరామమైన
లవ్ అఫెయిర్, తాజాపువ్వువంటి గార్డేనియా,
మనోల్లాసకరమైన పాస్‌పోర్ట్
రోజల్లా మిమ్మల్ని వన్నెతరగకుండా వుంచుతాయి



గోయా పరిమళ టాల్కం పౌడర్లు



పారిస్ లండన్ న్యూయార్క్

అట్లాంటిస్ (ఈస్ట్) లిమిటెడ్
(ఇంగ్లండులో స్థాపితం)

AGC 9 TEL




## అన్ని పంటలకు అనువైంది

# గ్రోమోర్ అమోనియం ఫాస్ఫేట్ 28·28·0

## పుష్కలమైన పంట — అధిక లాభం!



గ్రోమోర్ 28-28-0 మీరు వాడించే ప్రతి పంటకు వాడుటవలన ఎకరా అధిక లాభాలు పొందగలరు.

నత్రజని, భాస్వరామ్లము సమ పాళ్ళలో. అత్యధిక పోషక శక్తి కల్గిగిన రసాయనిక ఎరువు ఈ గ్రోమోర్ అమోనియం ఫాస్ఫేట్ 28-28-0. ఇందలి నత్రజని అమోనియా రూపంలో నున్నందున పైరుకు పూర్తిగా — వృధాకాకుండా — లభ్యమవుతుంది. ఇందలి భాస్వరామ్లము అమోనియా రూపంలో నున్న నత్రజనితో కలిసి యున్నందున, పైరుకు కావలసిన భాస్వరము ఎక్కువగా లభ్యమవుతుంది

గ్రోమోర్ వాడుట వలన రవాణా, కూలీ, నిల్వ చేయుటకగు ఖర్చులు తగ్గును.

ఈ బోర్డును ప్రదర్శించు డిస్ట్రిబ్యూటర్ల వద్ద రైతులకు కావలసిన గ్రోమోర్ ఎరువులు దొరుకును.




కోరమాండల్ ఫెర్టిలైజర్స్ లిమిటెడ్
[illegible] రోడ్, సికింద్రాబాద్-3, (ఆం. ప్ర.)

వ్యాపార వివరములకు సంప్రదించండి :

**ఇ. ఐ. డి. ప్యారీ లిమిటెడ్**

66, రాష్ట్రపతి రోడ్, సికిందరాబాద్-3 || డేర్ హౌస్, మద్రాస్-1

RAMDAS.K

లలిత సంగీత చక్రవర్తి
కె.వి. మహదేవన్ స్వరకల్పనలో
అమృతత్వాన్ని సంతరించుకున్న
భావగీతిక......

డి.యన్.నారాయణ సమర్పించు
పద్మా ఫిలింస్ వారి

# ఏకవీర

దర్శకత్వం... సి.యస్.రావు, B.A.(Litt)
కథ:-కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ
మాటలు:-డా॥ సి.నారాయణ రెడ్డి..




పాటలు: నారాయణ రెడ్డి, కృష్ణశాస్త్రి
స్క్రీన్ ప్లే: పి.చంగయ్య, B.A...
కళ: గోడ్ గాంకర్, వాలి....
నృత్యం:-వెంపటి సత్యం.....
కెమెరా: సత్యనారాయణ..
సహాయనిర్మాత: బి.ఎ.సీతారాం, BA.LLB

విడుదల:-ఆంధ్ర-జ్యోతీ, నైజాం-దివ్యదత్త, రాయలసీమ-నవభారత్

JOTHEE

# ఉత్తరాలు

### కథలు

25—4—69 సంచికలో ప్రచురించిన 'నేను మొగుణ్ణి కొనుక్కోను' అనే కథ చూశాక బాధ వచ్చింది. రచయితో రచయిత్రియో తెలియదు కాని శ్రీ/శ్రీమతి యాజుషిగారికి నా హృదయపూర్వక అభినందనలు. మగవారు ఇటువంటి కథలు చదివైనా కట్నంకోసం ఎగబడటం మానేస్తారని ఆశిస్తున్నాను. కథ వ్రాసింది మగవారు అయితే ఇంకొక 50 మార్కులు ఎక్కువగా అభినందిస్తాను. ఎందుకంటే కట్నం తీసుకోము అనే మాటలు అబ్బాయిలలో రావాలి కాని అమ్మాయిలతో వస్తే ఏమి లాభం? చదువుకుని ఉద్యోగాలు చేస్తున్న అమ్మాయిల్ని కోరుకొని ఈనాటి అబ్బాయిలు కట్నం కూడ కావాలనడం ఎంత శోచనీయం? నీరజను పెండ్లి చేసుకొన్న మేనేజరు లాంటివాళ్ళు ఎంతమంది వున్నారు?

భాగ్యం, రాధ, సీత, శకుంతల, (విశాఖ)

*   *   *

ఒక్కొక్కరి (మనో) బలహీనత విధివిధానం వల్ల దురదృష్ట ఫలంగా మారుతుందని 'కటకటాలు' కథలో రచయిత్రి చాల చక్కగ వర్ణించారు. మనో దౌర్బల్యం కూడదని సూచించడం ఎంతో బాగుంది.

కోనూరు రమణారావు, (అనకాపల్లి)

### ముఖచిత్రం

9—5—69 పత్రిక అక్కినేని ముఖచిత్రంతో అందంగా వెలువడింది. ఆ సంచికలోనే అక్కినేనిగారిపై తమ అమూల్యాభిప్రాయాలకు శ్రీ సి. పుల్లయ్య, అంజలీదేవి, కె. ఆర్. విజయ గార్లు చక్కగా వివరించారు. ఈ రజతోత్సవ వెండితెర కథానాయకుడికి నా అభిమాన 'పత్రిక' ద్వారా హృదయపూర్వకమైన అభినందనలు తెలియజేస్తున్నాను.

వై. కె. మూర్తి, (విజయవాడ)

### ఢిల్లీ లేఖ

తే 2—5—69 ది సంచికలో శ్రీ కృష్ణగారి న్యూఢిల్లీ లేఖలో 'చీఫ్ మినిస్టర్ జ్యోతిబాసు గారికి మెలుకువ వచ్చింది' అన్నారు. జ్యోతిబాసు గారు డిప్యూటి చీఫ్ మినిస్టర్ అని శ్రీ కృష్ణ గారికి తెలియదా? లేక అచ్చు పొరపాటా?

ఎస్. సర్వేశ్వరరావు, (ఒరిస్సా)

* అచ్చు పొరపాటే: (సం)




# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు:
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం: 23—5—'69
శ్రీ సౌమ్యనామ సం॥ జ్యేష్ఠమాసం శు॥ సప్తమి

సంపుటము: 61 సంచిక: 39

స్థాపితము:
1908

ముఖ్య సంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు:
శివలెంక రాధాకృష్ణ

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీధి, మద్రాసు-1

పోస్టుద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 26.00 |
| 6 మాసముల చందా | 13.00 |
| 3 మాసముల చందా | 6.50 |


## విషయానుక్రమణిక


పాండిత్యమూ,
సంస్కృతి
కల వ్యక్తి
డాక్టర హుస్సేయిన్


భయంకరమైన ప్రత్యర్థి
ప్రణాళిక
నిరుద్యోగ సమస్య


కొత్త సృష్టి
చైనా
సి.పి.ఐ.(మార్కిస్టు-లెనినిస్టు)


కుక్కతో వేట కుందేలుతో పరుగు
ఇండియాతో స్నేహం
పాకిస్తానుకి ఆయుధ సహాయం

# శతాబ్దాలుగా భారతదేశాన్ని దోచుకుంటున్న ఢిల్లీ

రాష్ట్రపతి డా. జాకీర్‌హుస్సెయిన్ హఠాన్మరణం దేశానికి తీరని లోటు. డా. జాకీర్ హుస్సెయిన్ పెద్ద విద్యావేత్త, మహాపండితుడు, గొప్ప మనిషి. దేశ విభజన తర్వాత మహమ్మదీయ వర్గం నాయకత్వం సన్నగిల్లుతూ వచ్చింది. ఉన్న కొద్ది మందిలో డా. హుస్సెయిన్ తమ మతం వారికి చక్కటి నాయకత్వం చేకూరుస్తూ వచ్చారు.

* * *

ప్రణాళికాసంఘం నాల్గవ ప్రణాళిక డ్రాఫ్ట్‌లో కొన్ని సవివరమయిన సూచనలు చేసింది. ఆదాయాన్ని ఎలా పెంచాలో ఈ సూచనలు తెలుపుతాయి.

ఆదాయం సంగతి సరే, కర్చుల మాట ఏమిటి?

కొన్ని శతాబ్దాలుగా ఢిల్లీ చరిత్రని పరిశీలిస్తే ఆ నగరం దేశంయొక్క రక్తాన్ని ఎలా పీల్చివేసిందో తెలుస్తుంది.

## షా జ హా న్

షాజహాన్ కట్టిన ఢిల్లీ ఎందరు మానవుల జీవితాలని బలిగొన్నదో చెప్పటం కష్టం— కోటలు, పాలరాతి భవనాలు, విలాస మందిరాలు, మసీదులు, ఉద్యానవనాలు ఒకటేమిటి, అన్నీ దేశ దారిద్ర్యాన్ని పెంపొందించాయి.

1947 దాకా బ్రిటిషువారు ఢిల్లీ భవనాల లెక్కలని వేరుగా ఉంచేవారు. అప్పటి నుంచి 'వర్క్స్' మంత్రిశాఖ వారి విపరీత వ్యయాలు న్యూఢిల్లీలో జరిగే దుబారా కర్చుకి నిదర్శనలు.

న్యూఢిల్లీ దేశానికి రాజధాని. రాజకీయాధికారం ఇక్కడే కేంద్రీకరింపబడి ఉంది. ప్రతి చిన్న విషయాన్నీ చివరికి ఉపాధ్యాయుల జీతాల దాకా, ఇక్కడికి ఈడుస్తారు. ఇక గోరక్షణ, హిందీ ప్రచారం, మద్యపాన నిషేధం మొదలయిన చిల్లర ఉద్యమాలన్నిటికీ న్యూఢిల్లీయే నిలయం. న్యూఢిల్లీ సాలెగూడులోని మధ్యభాగం వంటిది.

## ఢిల్లీ—గంగ

సనాతన సాంప్రదాయాలని గౌరవించే వారు అస్తికలని గంగలో కలుపుతారు. డాక్టర్ రాజేంద్రప్రసాద్ అస్తికలలో ఒక భాగాన్ని ఢిల్లీకి తీసుకు వచ్చారు— ఆయన గంగానదీతీరం వద్దనే మరణించినప్పటికీ.

అలహాబాదు త్రివేణి సంగమ ప్రదేశం. శ్రీ పి. ఎన్. సప్రూ ఆ ఊరు మనిషే. ఆయన మృతదేహాన్ని స్వంత ఊరికి తీసుకుపోలేదు. దహనక్రియలు కొత్త ఢిల్లీలో జరిపించారు.

. మహాత్మాగాంధి, పండిత నెహ్రూ, శ్రీ లాల్ బహదూర్ శాస్త్రి— వీరి సమాధులని కట్టటానికి లక్షలు కర్చు చేస్తున్నారు. యమునా నది కుడి తీరం వీటితో నిండిపోయింది. ఇక ఎడమ తీరాన్ని అభివృద్ధి చేస్తారు—ఎన్ని లక్షలు కర్చు అవుతాయో చెప్పలేము.

## ఇళ్లు, ఇళ్లు, ఇళ్లు—

అక్కరలేని కార్యాలయాలెన్నో రాజధానిలో ఉన్నాయి. వాటిని బదిలీ చెయ్యటం ఎవరితరమూ కాలేదు. ఇక వాటికి కావలసిన గృహ నిర్మాణం చెయ్యటం మొదలుపెట్టారు. 1968–69 లో 682 క్వార్టర్లు కట్టారు, 952 మీద పని జరుగుతూ ఉంది. మరొక 224 జారీ చెయ్యనున్నారు. ఇంకా 400 క్వార్టర్ల విషయంలో లేయవుట్లు కోసం ఎదురు చూస్తున్నారు. ఢిల్లీలో దొరికే జీతాలు మరెక్కడా దొరకవు. అందుచేత అందరూ ఢిల్లీకి వెడతారు. వీరిలో ఎందరో తమకి ఇష్టం వచ్చిన చోట బైఠాయిస్తారు. అందరూ వోటర్లే. ఎవరికీ కోపం రానివ్వరాదు! ఇక నీటి కొరత, అశుభ్రత, నేరాలు ఎందుకు పెరగవు?

ఢిల్లీలో కట్టడాలకి కోట్లు కర్చవుతున్నాయి. సిమ్లా వంటి చోట్ల కోట్ల రూపాయల ఆస్తులు దండుగ అవుతున్నాయి.

## పారశీక సాంప్రదాయం

పారశీక సామెత ఒకటి ఉంది, అధికారంలోకి వచ్చిన వారంతా ఇళ్ళు కడ్తారని. కాబినెట్ మంత్రుల విషయంలో ఇది అక్షరాలా నిజం. శ్రీయుతులు కనుంగో, ఎస్. కె. డే., దినేష్‌సింగ్‌లు తమ కార్యాలయాల పునర్నిర్మాణం కోసం ఎంత కర్చు చేశారో తల్చుకుంటేనే భయం వేస్తుంది. వారి తర్వాత వచ్చిన వారు మళ్లీ పునర్నిర్మాణం మొదలు పెడ్తారు—ఇదీ వరస.

## రోడ్ల వెడల్పు

ఎన్నో దేశాలలో రోడ్ల మీద బళ్ల రద్దీ ఎక్కువ అయితే బళ్ల రాకపోకలని అదుపులో పెడ్తారు. ఢిల్లీలో రోడ్ల వెడల్పు పెంచుతారు. రద్దీ మాత్రం హెచ్చు అవుతూనే ఉంటుంది.

ఇక నగరాలంకరణ పోటీలో పాత, కొత్త ఢిల్లీల దుబారా కర్చు అవర్ణనీయం.-ఒక వయిపు తాగే నీరు లేదు; మరొక వయిపు ఫవుంటెన్లు. ఒక వయిపు శిథిల గృహాలు; మరొక వయిపు రోడ్లకి ఎర్రరాళ్లు.

ప్రతి చిన్న విషయానికి మంత్రులు ఆవిష్కరణ. ఇది మరొక రకం దుబారా కర్చు.

న్యూఢిల్లీలో మాత్రమే కళాశాలల కొరత ఉంది. బొంబాయి, మదరాసు, కలకత్తాలలో లేదు. అందుచేతనే కాబోలు ఏటా రెండు కాలేజి అయినా ఇక్కడ వెలుస్తూ ఉంటాయి.

కళాశాలలు, విశ్వవిద్యాలయాలు రాజకీయవేత్తల ఆటలకి నిలయాలు అవుతున్నాయి. అందుకోసం వారు ఇంకా కావాలంటారు. ఇక ఉపాధ్యాయుల నియమంలో విచక్షణ లేకపోవటంవల్ల విద్యాప్రమాణాలు తగ్గిపోతున్నాయి.

## పాలు

1966—67 లో మాత్రం ఢిల్లీ పాల సరఫరా స్కీము లాభం చేసింది. పెట్టినప్పటి నుంచి నేటి దాకా రు. 2 లక్షలు నష్టం వచ్చింది ఈ సంస్థకి. ఢిల్లీ జనం కన్నా పాల అవసరం ఎక్కువ కలవారు ఎందరో ఉన్నారు.

పండితనెహ్రూగారు ఢిల్లీలోపార్లమెంటరీ 'డెమోక్రసీ'ని ప్రవేశ పెట్టారు. బాగానే ఉంది కాని పరిపాలన వ్యయం మాత్రం బాగా పెరిగిపోయింది. పండిత పంత్‌గారు 'అర్బన్, రూరల్'ఢిల్లీకి మునిసిపల్ కార్పొరేషన్లని సృష్టించి కర్చుని మరింత పెంచారు. మునిసిపల్ కార్పొరేషన్‌లో జరిగే పని ఏమిటి, అని చూస్తే సభ్యుల పోట్లాటలు, వాకవుట్లు అని తెలుస్తున్నది.

వీరిద్దరి తర్వాత గుల్జారీలాల్‌నందాగారు కలుగ జేసుకున్నారు. 'మెట్రోపాలిటన్ కవున్సిల్' ఒక దానిని సృష్టించారు. దుబారాఖర్చు ఇంకా పెరిగింది.

1967—68 లో కేంద్రం సెక్రెటేరియట్ యొక్క ఉత్తరం, దక్షిణం భాగాలమీద అయిన కర్చు రు. 9 65,846. ఉద్యోగ్, కృషి, శాస్త్రి, నిర్మాణ భవనాలమీద మరెంత అయిందో తెలియదు.

శుభ్రంగా ఉండాలనటం, ఉండటం బ్రిటిషువారు చేసిన దౌర్జన్యాలలోవి. వారు వెళ్లిపోయిన తర్వాత వాటికి ఉద్వాసన చెప్పినట్లు తోస్తుంది. ఈ పెద్ద పెద్ద కట్టడాలలో మామూలు ఉద్యోగులకి ఇచ్చే పాయిఖానాలలోనుంచి వచ్చే సువాసన అవర్ణనీయం. పాయిఖానాలు వాడిన తర్వాత నీరు పొయ్యటం అనేది బ్రిటిషువారి దురలవాటులలో ఒకటి. వారి పోక తర్వాత ఈ వ్యసనం ఆగిపోతున్న సూచనలు బాగా కనిపిస్తున్నాయి. (మంత్రులు, సెక్రెటరీలు తమ పాయిఖానాలని శుభ్రంగా ఉంచుకుంటే చాలుననుకుంటారు)

సాధారణంగా హైందవ మతస్థులు తమ దేహాలని శుభ్రంగా ఉంచుకుంటారు. తమ పరిసరాల విషయంలో మాత్రం అంత శ్రద్ధ వహించరు. దీనికి ఈ పెద్ద కార్యాలయాలే తార్కాణాలు.

(64వ పేజీ చూడండి)

# 2:1 లేక మాది మాకు-మీది మాకే...

ఈ శతాబ్దం ప్రారంభంలో బ్రిటిషువారు బెంగాల్‌ని విభజించినప్పుడు రవీంద్రనాథ్ టాగూర్, 'దేవుడు కలిపిన దానిని మానవుడు విడదీయ లేడు.' అన్నారుట. ఆయన ఈ మాటలు అన్న ఏభయి ఏళ్ల లోపల బెంగాల్ రెండు దేశాలుగా విడిపోయింది! (పాకిస్తాన్‌తో చేరిన తూర్పుబెంగాల్ మళ్లీ విడిపోయే సూచనలు కనిపిస్తున్నాయి. ఒక ప్రాంతంలోని జనం తామంతా ఒకటే అనుకోవాలి గాని 'దైవసృష్టి,' అని వట్టి చెప్పుకుంటే ప్రయోజనం ఉండదు.

అయితే, ఒక వర్గంవారు రెండవవారి భుజాలమీద కూర్చుని కాలం గడుపుదామనుకుంటే అంతకన్నా ప్రయోజనం లేదు. విడిపోయినా స్వతంత్రంగా బతకగలమనే నమ్మకాన్ని కనీసం ఆత్మగౌరవం కోసమయినా తెచ్చుకోవటం మంచిది.

ఈ విషయంలో కొందరు రాజకీయవాదులు (వారు నిజాయితీ కలవారయినాసరే అవకాశవాదులయినాసరే) చెప్పేదంతా ప్రామాణికంగా తీసుకొనలేము. నిర్ణయం ఎటువంటిదయినా ప్రజాబాహుళ్యం తీసుకొనవలసినదే.

## ప్రజాస్వామ్య సాంప్రదాయాలు

భారతదేశం ఒక ప్రజాస్వామ్యం. ఇక్కడ ఏదయినా పెద్ద మార్పు సంస్కరణ అమలు జరగవలసి వచ్చినప్పుడు కొన్ని పద్ధతులని అనుసరించవలసి ఉంటుంది. ప్రజాస్వామ్య సాంప్రదాయాలు తెలియని ప్రాంతాల వారికి ఈ సంగతి అర్థం కావటం కష్టమే; కాని, రాష్ట్రం మొత్తంమీద ఒకే ప్రభుత్వం ఉందని నమ్ముకుని, తమకి కొత్త అయిన ప్రాంతాలకి బ్రతుకుతెరువు కోసం వెళ్లిన సామాన్యోద్యోగులని హింసించటం ఆత్మాభిమానం, న్యాయాన్యాయ విచక్షణ కలిగిన వారు చెయ్యదగిన పనికాదు. ఒక వర్గంవారు, వీలయినంత దాకా రెండవ వర్గం వారి సంపాదన, కృషి మీద ఆధారపడి జీవించాలనుకోవటం కూడా ఆత్మాభిమానం కలవారు చెయ్యదగిన పనికాదు.

**అసహాయులయిన సామాన్య జనాన్ని కాపాడే బాధ్యత తమకే ఉందని పరిపాలకులు గుర్తించాలి.**

దేశం మొత్తంమీదనే అన్నిప్రాంతాలలోనూ సమానమయిన అభివృద్ధి జరగటం లేదని ప్రణాళికా సంఘ సభ్యుల నుంచి గ్రామపంచాయితీ సభ్యుల దాకా అందరూ అంటూనే ఉంటారు. ఏ ప్రాంతంలో వసూలయిన డబ్బు ఆ ప్రాంతంలోనే కర్చు కావాలనే సిద్ధాంతాన్ని నిరాపించటం కష్టం. 'ఎవరి సామర్థ్యాన్ని బట్టి, ఎవరి అవసరాన్ని బట్టి వారు ఉత్పత్తి చేసి జీవించగలిగే' స్వర్గం వంటి వ్యవస్థ ఈ లోకంలో ఏర్పడే దాకా సహజీవనం, అవసరం అని గుర్తించాలి.

## నాయకులనబడే వారి ఒడంబడికలు

సహజీవనం, సర్దుబాట్లు చేసుకోవటం రాజకీయాలలో ముఖ్యాంశాలు కాబట్టి కొన్ని సమయాలలో నాయకులనబడే కొందరు చేసుకున్న ఒడంబడికలని గౌరవించే అవసరం అన్నివర్గాల వారికీ కలుగుతుంది. పరాన్న భోజనమనే సిద్ధాంతాన్ని సహిస్తారు.

తెలంగాణా ప్రాంతం 'ఆంధ్రప్రదేశ్'లో చేరి ఇప్పటికి పన్నెండు సంవత్సరాలు దాటింది. తెలంగాణా 1948 దాకా నయిజామ్ సరిపాలన కింద ఉన్న సంస్థానంలో ఒక భాగం. ఒకప్పుడు హైదరాబాదు సంస్థానా అన్నిటిలోనూ పెద్దది; కాని, వాటన్నిటికన్నా వెనుకబడినది. అందుచేతనే షెడ్యూల్డ్ తరగతుల వారికి ఏర్పరిచినట్లే తెలంగాణా వారికి కూడా కొన్ని సంరక్షణలు ఏర్పరస్తూ వచ్చారు (హరిజనులకి అన్యాయం చేసినవారు యావద్దేశ ప్రజలు; తెలంగాణా వారికి అంతకి ముందు ఎవరు ఎటువంటి అన్యాయాలు చేసినా 'ఆంధ్రప్రదేశ్'లోని ఇతర ప్రాంతాలవారు మాత్రం కాదు.)

## అమాయకోద్యోగుల హింస

ఈ సంరక్షణల విషయమయి కొన్నినెలల క్రితం దాకా పెద్ద అలజడి ఏదీ జరిగినట్లు కనిపించదు. 1969 ప్రారంభంలో మాత్రం, తెలంగాణా ఉద్యమం ఒకటి మొదలయింది. తెలంగాణా ప్రాంతానికి అన్యాయం జరిగిందనే నినాదం బాగా ప్రచారం లోకి వచ్చింది. తెలంగాణాకి రావలసిన డబ్బుని 'ఆంధ్రప్రదేశ్'లోని ఇతర ప్రాంతంలో కర్చు చేశారనే ఆరోపణ అన్నిచోట్లా వినబడింది. అతి శీఘ్రకాలంలో ఎందరో అమాయకులయిన చిన్న ఉద్యోగులని అమానుషమయిన హింసలకి గురి చేసిన ప్రత్యేక తెలంగాణా ఉద్యమం ఒకటి బయలుదేరింది.

> శ్రీ కుమార్ లలిత్ నివేదిక ప్రకారమే తెలంగాణా ప్రాంతంలో కాపిటల్ పద్దుకింద కార్పొరేషన్‌ల పద్దుకింద జరిగిన అధికవ్యయం రు. 30 కోట్లు. దీనిని బట్టి కొన్ని పద్దుల కిందనయినా వసూలయిన మొత్తాలకీ కర్చు అయిన మొత్తాలకీ, ప్రతి పద్దు కిందా, ప్రాంతీయమయిన ఎల్లలు నిర్ణయించటం కష్టం అని తెలుసు నది.

హైదరాబాదులో ప్రభుత్వాన్ని నడుపుతున్న పెద్దలు 'తెలంగాణాలో జరగవలసినంత కర్చు జరగలే'దని బహిరంగంగా అంగీకరించారు, ఉద్యమానికి బలం చేకూర్చారు.

## 'మిగులు?'

కేంద్ర ప్రభుత్వాధికారులని ఆశ్రయించి తెలంగాణా 'మిగుళ్ల'ని లెక్క వేసేందుకు ఒక పెద్ద అధికారిని రప్పించారు.

ఆ అధికారి శ్రీ కుమార్‌లలిత్‌కి కొన్ని లెక్కలు ఇచ్చి వాటిద్వారా మిగుళ్లని ఎలా తేల్చాలో 'ఆంధ్రప్రదేశ్' ప్రభుత్వం వారే చెప్పారు.

శ్రీ లలిత్ రిపోర్టు 1969 మార్చిలో వెలువడింది. అది చదివిన వారికెవరికయినా 'ఆంధ్రప్రదేశ్' ప్రభుత్వం వారు చేసిన సూచనలు ఆశ్చర్యం కలిగించక మానవు. (ఒక సూచనని శ్రీ లలిత్ కూడా స్వీకరించకుండా తోసివేశారు!)

శ్రీ లలిత్ నివేదికవల్ల తేలిన 'తెలంగాణా మిగుళ్ల' స్థూల సంఖ్యలు ఈ క్రింది విధంగా ఉన్నాయి.

1. రివెన్యూ మిగుళ్లు... రు. 64 కోట్లు (+)
2. కాపిటల్ అధికవ్యయం రు. 18 కోట్లు (—)
3. కార్పొరేషన్ జమకింద జరిగిన అధిక వ్యయం..... రు. 12 కోట్లు (—)

అంటే రు. 64 కోట్లలో 18 + 12 కోట్లు తీసివేస్తే సుమారు రు. 34 కోట్లు 'మిగిలా'యన్నమాట.

## 2:1 సిద్ధాంతం

ఇక్కడ ఒక ముఖ్యమయిన సిద్ధాంతాన్ని గమనించాలి. మొదటి నుంచీ తెలంగాణా జనాభా 'ఆంధ్రప్రదేశ్' జనాభాలో మూడవ వంతు ఉన్నది కాబట్టి ఆదాయ, వ్యయాలు రెండిటిలోనూ 2:1 నిష్పత్తిని రెండు ప్రాంతాలవారూ గుర్తించారు. (నాగార్జునసాగర్ విషయంలో ఇది నిజం కాదు కాని దానిని వేరుగా పేర్కొనటం జరుగుతుంది.)

ఈ 2:1 నిష్పత్తి సిద్ధాంతాన్నే శ్రీ లలిత్ తమ నివేదికలో చాలావరకు వాడారు.

మరొకవిధంగా చెప్పాలంటే, ఆంధ్రలో 2 పాళ్లు కర్చు అయితే తెలంగాణాలో 1 పాలు కర్చు కావాలన్నమాట.

శ్రీ లలిత్ నివేదికలో ఇచ్చిన వివరాల ప్రకారం 1956 నుంచి 1968 దాకా 'ఆంధ్రప్రదేశ్'లో జరిగిన రివెన్యూ, కాపిటల్ కర్చు మొత్తాలు ఈకింది విధంగా ఉన్నాయి:

రివెన్యూ కర్చు.... రు. 1223 కోట్లు.
కాపిటల్ కర్చు..... రు. 0425 కోట్లు,
2:1 సిద్ధాంతం ప్రకారం తెలంగాణాకి పిటితో




# 'ఆంధ్రప్రదేశ్'లో వివిధ ప్రణాళికలకింద జరిగిన మొత్తం ఖర్చు రు. 773.9 కోట్లు

రావలసిన మొత్తాలు—

రివెన్యూ కర్చు.... రు. 407.7 కోట్లు.
కాపిటల్ కర్చు....... రు. 141.7 కోట్లు.

మొత్తం.... రు. 549.4 కోట్లు.

శ్రీ లలిత్ నివేదిక ప్రకారం యదార్థంగా జరిగిన కర్చులు ఇలా ఉన్నాయి :

రివెన్యూ కర్చు.... రు. 450 కోట్లు
కాపిటల్ కర్చు.... రు, 152 కోట్లు

మొత్తం.... రు. 602 కోట్లు.

అంటే, తెలంగాణాలో జరిగిన అదనపు కర్చు రు. 602 — రు. 549.4 = రు. 52.6 కోట్లు అన్నమాట!

## ప్రణాళికల కర్చు

ఇంతేకాదు ఇటీవలే 'ఆంధ్రప్రదేశ్' ప్రభుత్వం వారి 'ప్లానింగ్ ఎండ్ పంచాయితీ రాజ్ డెవలప్మెంట్' శాఖవారు వెలువరించిన 'రీజనల్ డెవలప్మెంట్ ఇన్ ఆంధ్రప్రదేశ్' అనే పుస్తకం లేక కరపత్రంలో ఈ కింది వివరాలు ఉన్నాయి—

1. రెండవ పంచవర్ష ప్రణాళికలో 'ఆం. ప్ర.'లో జరిగిన

## 1:2 లేక మూడి వాటు...

మొత్తం కర్చు..... రు. 188.6 కోట్లు.
ఇందులో తెలంగాణాకి రావలసిన మొత్తం... రు. 062.9 కోట్లు.
యదార్థంగా తెలంగాణాలో జరిగిన కర్చు...... రు. 064.4 కోట్లు.
అంటే తెలంగాణాలో జరిగిన అదనపు కర్చు.... రు. 001.5 కోట్లు.

2. మూడవ పంచవర్ష ప్రణాళికలో 'ఆం. ప్ర.' లో జరిగిన కర్చు... రు. 352.4 కోట్లు.
ఇందులో తెలంగాణాకి రావలసిన మొత్తం..... రు. 117.5 కోట్లు.
యదార్థంగా తెలంగాణాలో జరిగిన కర్చు...... రు. 146.6 కోట్లు.
అంటే తెలంగాణాలో జరిగిన అదనపు కర్చు...... రు. 029.1 కోట్లు.

3. రాష్ట్రం సంవత్సర ప్రణాళికలు (1966—69) లో 'ఆం. ప్ర.' లో జరిగిన కర్చు...... రు. 232.9 కోట్లు.
ఇందులో తెలంగాణాకి రావలసిన మొత్తం... రు. 077.6 కోట్లు.
యదార్థంగా తెలంగాణాలో జరిగిన కర్చు...... రు. 102.6 కోట్లు.
అంటే తెలంగాణాలో జరిగిన అదనపు కర్చు.... రు. 025.0 కోట్లు.

పయిన వివరించిన మూడు పద్దులలో తెలంగాణాలో జరిగిన అదనపు కర్చు రు. 55.6 కోట్లు

ఇక్కడ ఒక ముఖ్యమయిన సంగతి గమనించవలసి ఉంది. రెండవ పంచవర్ష ప్రణాళిక స్వరూపం నేటి 'ఆంధ్రప్రదేశ్' ఏర్పడక ముందే స్థూలంగా నిర్ణయింపబడింది. అందులో తెలంగాణాలో జరిగిన అదనపు కర్చు రు. 1.6 కోట్లు మాత్రమే అయితే తర్వాతి పంచవర్ష ప్రణాళికలో రు. 29.1 కోట్లు, సంవత్సర ప్రణాళికలలో రు. 25 కోట్లు అదనంగా కర్చు అయ్యాయి.

## దీనిభావమేమి?

అంటే సుమారు 1961 నుంచి మాత్రం, తెలంగాణాలో చాలా పెద్ద మొత్తం రు. 541 కోట్లు—అదనంగా కర్చు అయిందన్నమాట. దీని మీద ప్రత్యేక వ్యాఖ్య అనవసరం!

పయి సంఖ్యలని బట్టి తెలంగాణాలో రాష్ట్ర ప్రభుత్వం కర్చుల కింద అదనంగా (2:1 సిద్ధాంతాన్ని బట్టి) రు. 52.6 కోట్లు;

పంచవర్ష ప్రణాళికల కింద రు. 30,7 కోట్లు., రాష్ట్రసంవత్సర ప్రణాళికల కింద రు. 25 కోట్లు కర్చు అయ్యాయన్నమాట.

ఇంత అదనపు కర్చు జరిగినప్పటికీ శ్రీ కుమార్ లలిత్ నివేదిక ప్రకారం తెలంగాణాకి రు. 34 కోట్లు 'మిగిలాయి'!

## ఇది నమ్మదగ్గ విషయమా?

## తార్కాణం

ఈ ప్రశ్నకి ప్రత్యేకంగా సమాధానం అవసరం. శ్రీ లలిత్ నివేదికని పరిశీలిస్తే కొన్ని పద్దులలో తెలంగాణా ఆదాయం ఎక్కువగా కనిపిస్తుంది. మరికొన్ని పద్దుల కింద ఆంధ్రప్రాంతం ఆదాయం ఎక్కువగా కనిపిస్తుంది. ఏ పద్దుకి చెందిన ఆదాయం ప్రకారం ఆ పద్దు కింద కర్చు జరిగి ఉండదని లోకజ్ఞానం ఉన్న ఎవరయినా ఎదురు చూస్తారు. వారి ఊహ సరయినదే నని శ్రీ లలిత్ నివేదిక తెలుపుతుంది. కొన్ని పద్దుల కింద ఆదాయం మాత్రమే ఉంటుంది. మరికొన్ని పద్దుల కింద ఇంచుమించు వ్యయం మాత్రమే ఉంటుంది. ఏ ప్రాంతంలో ఆదాయం ఆ ప్రాంతంలోనే కర్చు అవాలి అనే సిద్ధాంతం ఆచరణలో ఎంత కష్టమో శ్రీ లలిత్ నివేదిక తెలుపుతుంది. (కాపిటల్, కార్పొరేషన్ల పద్దుల కింద తెలంగాణా ప్రాంతంలో 'అధికవ్యయం' 30 కోట్ల రూపాయల దాకా జరిగిందని శ్రీ లలిత్ నివేదిక పేర్కొనటం కూడా ఈ సిద్ధాంతం 'ఆంధ్ర

# ఉత్తమోత్తమ ట్రాన్సిస్టరు అయినది



సోంగ్-2
2 బాండ్లు
రు 175 00



మినీ బాయ్
2 బాండ్లు
రు 175 00



మున్నా
మీడియం వేవ్,
రు. 110.00



మినీ మాస్టర్-3
2 బాండ్లు
రు. 220.00

# మర్ఫీ ట్రాన్సిస్టరే అన్నివిధాలా



ముసాఫిర్
3 బాండ్లు రు 283 00



మోడలు టిబి 0816
3 బాండ్లు
రు 415 00



మ్యూజీషియన్
మీడియం వేవ్ రు 125 00

మర్ఫీ ట్రాన్సిస్టరుకు కావలసినది పెద్దసైజు టార్చి సెల్సు
ధరలు ఎక్సైజు పన్నుతో సహా అమ్మకపు పన్ను అదనం

## ఉత్తమ శబ్దం, ఉత్తమ పరికల్పన, సముచిత మూల్యం

భారత దేశపు అత్యధునాతన ట్రాన్సిస్టరు కర్మాగారంలో తయారుచేయబడినది.
ప్రతి మర్ఫీ ట్రాన్సిస్టరు రేడియో నిర్మాణంలో 20 సంవత్సరాల పరిశోధన, అనుభవం.
సాంకేతిక నైపుణ్యం ప్రతిబింబించే అత్యుత్తమ ట్రాన్సిస్టరే
75 వేలకుపైగా విదేశాలలో అమ్ముడుపోయాయి మర్ఫీ ట్రాన్సిస్టర్లు, రేడియోలు
వాస్తవానికిది, మర్ఫీయొక్క ఉత్తమ కార్యశీలతకొక నిజమైన నిదర్శనం.



**మర్ఫీ ఇంటిలో అందరి ఆహ్లాదమునకు!**

**లిట్ క్విజ్ నెం 50 — 18 క్లూలు**

1 ఎంత పరోక్ష రూపమందైనాసరే ఏ విధంగానైనా, **బెదరించి/కళంకిత** మొనర్చినపుడు కుపితుడుకాని మానవుడు వుండడు

2 భారతదేశం లోకప్రసిద్ధమైన **దానశీలత/సమృద్ధి** మరియు అతిథి సత్కార నిమగ్న దేశం

3 మీరు ఎంత తీవ్ర యత్నం చేసినా సరే, మీరు నిరంతర **స్వయంతిరస్కృతి/కర్తవ్యవిమూఢత** జరుపజాలరు

4 వడ్డీ రేటు ఎంత తక్కువైతే అంత అధికంగా **వికాసముకు/పెట్టుబడికి** ప్రోత్సాహం లభిస్తుంది

5 ప్రేమ లేక **కర్తవ్యం/విశ్వాస పాత్రత** లేక దయనిమిత్తం నెరవేర్చే సేవలు మూల్యమైనవి కావచ్చు కాని ధనరూపేణా గణింపబడజాలవు

6 ఇద్దరు వ్యక్తులమధ్య ఘోర జగడం ఉద్భవించుట ఒకరు మరియొకరి **అభివృద్ధి/బతికియుండుటను** సమ్మతించనప్పుడు సంభవించుతుంది

7 ఈర్ష్య **విస్తార విలువ/విప్లవకారి**యైనది

8 తన లక్ష్యములను నిర్వహించే అవకాశమును చిక్కించుకొనజూచే మానవుడు **అనుగ్రహాలను/మిత్రులను** పొందనుంకించను

9 ఒక్కటే మాటకు ఒక్కమాటే సిగ్గు కలుగుతుంది **వ్యధ/అపరాధంకు** పూర్తిగా జీవనమంతట్లో సంభవనీయం

10 నిజంగా చావులేదు, అట్లు కనిపించేది **భ్రమ/సంక్రమణ**

11 రోగం ఆకలి, పేదరికం మరియు **అశక్తత/ఉన్మాదత** సహితం, వీటిని తగ్గించే సాధనను మనం విజ్ఞానంవల్ల ఆశించగలం

2 భారతదేశం ఆదికాలంనుండియే గొప్ప **బౌద్ధిక/ఆధ్యాత్మిక** సాధనకారియైనదేశం

13 **అభ్యసించే/మార్పుజేసే** శక్తిని ప్రదర్శించు జీవిత ప్రాణుల దృష్టాంతములు మనకిందరకు పరిచయములే

14 బాలుడు తన ఇరుగు పొరుగు వారినుండి **తనమనోవృత్తిని/నైతికతను** ఆర్జించును

15 హింస **రాజనీతిక/సామాజిక** పరివర్తనకు మంత్రసానియై వున్నది

16 జంతు జీవనం ఉద్దేశ్యహీనమైనది, భౌతిక అగత్యతలకు బంధీకృతమైనది దీనికి పోల్చి చూడగా మానవుడు **శక్తి/ఉద్దేశ్య** పూర్ణక గొప్ప అంగక్రమ నిర్మాణంలో యున్నాడు

17 అద్భుత **కల్పితగాధ/నిత్యక్రమం** జీవనంనుండి తొలగింపబడజాలదు

18 నిర్ణయశక్తి, తర్కమనోబుద్ధి మరియు విచార వినిమయత ఇవన్నియు **విచారశీల/విజయ** మనుష్యుని చిహ్నములు

## No. 50: 18 CLUES

1 No human being lives who does not resent being **Bullied / Sullied** in any way, however indirectly

2 India is a land of proverbial **Charity / Plenty** and hospitality.

3 However hard you try, you cannot **Damn / Disown** yourself eternally

4 The lower the rate of interest the greater will be the stimulus to **Development / Investment**

5 All services performed for love or **Duty / Loyalty** or kindness may be of value but cannot be measured in money terms

6 The most serious friction that can arise between two persons occurs when one denies the right of the other to **Excel / Exist**

7 Ill will is **Expensive / Explosive**

8 The man who sees a chance of accomplishing his aims seeks to win **Favours / Friends**

9 Shame can be but for a single act **Grief / Guilt** is for all existence

10 There is indeed no death, what seems so is **Illusion / Transition**

11 From science we can expect the means to reduce disease hunger poverty, and even **Infirmity / Insanity**

12 India from the earliest times, has been a land of great **Intellectual / Spiritual** activity

13 We are all familiar with examples of living creatures exhibiting to **Learn / Turn**

14 The child acquires his **Mentality / Morality** from his environment

15 Violence is the midwife of **Political / Social** change

16 The life of an animal is purposeless, tied to physical needs, in comparision, man is part of a great organism of **Power / Purpose**

17 **Romance / Routine** cannot be eliminated from life

18 Power of judgment, reasoning faculty, and deliberation are all marks of the **Thinking / Winning** type

**గమనిక పై క్లూలు ప్రసిద్ధ గ్రంథకర్తల పుస్తకములనుండి తీసుకొనబడినవి అవి పూర్తి వాక్యములు మరియు వేరు వేరుగా పూర్తి అర్థవంతమైనవి గ్రంథకర్తలు, వారి పుస్తకముల పేర్లు ఆఫీషియల్ సొల్యూషన్‌తో పాటు లిట్‌క్విజ్ వీక్లీలో ప్రచురింపబడును.**

ప్రదేశ్‌లో ఆచరింపబడ లేదనటానికి తార్కాణం )

తెలంగాణాలో పయిన చెప్పిన విధాలుగా ఎంతో అధికవ్యయం జరిగినప్పటికీ మిగుళ్ళు ఎలా ఉంటాయనే ప్రశ్నని మళ్లీ వేస్తే ఎవరయినా ఇవ్వగలిగిన సమాధానం ఒకటే

**అది, 'రకరకాల పద్దులక్రింద వచ్చే ఆదాయాలని కేటాయించటంలో తెలంగాణాకి రావలసిన వాటికన్నా ఎక్కువ మొత్తాలని కేటాయించారు,' అనేదే.**

శ్రీకుమార్ **లలిత్** నివేదికలో ప్రచురితమయిన ఉత్తర ప్రత్యుత్తరాలు (శ్రీ లలిత్‌కీ ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వానికీ మధ్య జరిగినవి) ఈ అనుమానాన్ని బలపరుస్తాయి

తెలంగాణా ఆదాయాన్ని విపరీతంగా పెంచటానికి విచిత్రమయిన సర్దుబాట్లు చేశారని నిస్సందేహంగా చెప్పవచ్చు

## శ్రీ ప్రగడకోటయ్య

ఈ సందర్భంలో శ్రీ ప్రగడ కోటయ్యగారు ముఖ్యమయిన విమర్శలు కొన్ని చేశారు చిన్న, చిన్న ఎవరాలు ఎన్నో ఎట్లా ఉన్నప్పటికీ తెలంగాణా ఆదాయాన్ని విపరీతంగా పెంచటానికి ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం వారు అవలంబించిన పద్ధతులు, ముఖ్యమయినవి రెండిటిని ఆయన వేలెత్తి చూపారు

1 రాజధాని ఇక్కడ జరిగిన కర్చుని చాలా వరకూ 21 నిష్పత్తిలో ఆంధ్ర తెలంగాణా ప్రాంతా వారి మధ్య పంచారు

(చాలా వరకూ అని ఎందుకు చెప్పవలసి వచ్చిందంటే 1956—61 దాకా రాజధానిలో జరిగిన పబ్లిక్ హెల్త్ వ్యయాన్ని పూర్తిగా ఆంధ్రప్రాంతానికే అంటగట్టారు!)

**రాజధానిలో కర్చుని 21 నిష్పత్తిలో పంచినప్పుడు ఆదాయాన్ని కూడా అదే నిష్పత్తిలో పంచాలి**

## అమ్మకం పన్ను

కాని, అలాగ చెయ్యలేదు ఉదాహరణకి సేల్స్ టాక్స్ లేక అమ్మకం పన్నుని తీసుకుంటే 1956-57 నుంచి 1967—68 దాకా తెలంగాణాలో వసూలు అయిన మొత్తం శ్రీ లలిత్ నివేదిక ప్రకారం రు. 74 కోట్లు

ఇందులో రాజధానిలో వసూలయినది ఎంతో శ్రీలలిత్ నివేదిక **తెలుపటం లేదు** కాని, ప్రభుత్వం రికార్డులు అది రు 49 6 కోట్లు అని తెలుపుతున్నాయి

**దీనిని 2,1 నిష్పత్తిలో పంచితే ఆంధ్రప్రాంతం వాటా సుమారు రు 33 కోట్లు వస్తుంది.**

తెలివితేటలే ప్రధానభూమిక వహించే వినోద క్రీడ

Rs 50,000 LITQUIZ No 50

1st PRIZE Rs. 22000 | 2nd PRIZE Rs. 10,000

RUNNERS UP (UP TO 4 ERRORS) Rs 7500

EVERY ALL CORRECT WILL GET A WRISTWATCH MINIQUIZ (UPTO 1 ERROR) Rs 8000

SUBSCRIBERS QUIZ Rs 2500

ఈ క్విజ్‌లో 3 నెలల (రు 3) 6 నెలల (రు 6) మరియు సంవత్సర (రు 12, చందాదారు లందరు పాల్గొనవచ్చును వీరు ఖాళీగా యుండుకై వదలిన స్థలములో తమ చందా నెంబరు తప్పకుండా వేయవలెను వీరుతమ చందా క్రింద క్రొత్తగా రు 3, రు 6, లేక రు 12 ఎంట్రీ ఫీజుతో పంపుచున్న యెడల కూపను క్రింద వున్న క్రొత్త అను చోట గుర్తించవలెను

క్రొత్తగా ప్రారంభించిన యీ చందాదారుల క్విజ్ స్కీము మా చిన్న మరియు పెద్ద చందాదారుల అభిమానమును తప్పకుండా పొందగలదని ఆశిస్తున్నాము

మీ చందా నేడే పంపండి ఇది మీకులాభదాయకం కాగలదు

## లిట్ క్విజ్ నెం 50 అధికార ఎంట్రీ ఫారము

ఆఖరు ముగింపు తేదీ 4-6-69 బుధవారం

ADDRESS LITQUIZ No 50 ALANKAR BALARAM STREET BOMBAY-7 (W B)

గమనిక 1) ఒక్కొక్క కాలంలో మీరు వద్దనే పదమును కొట్టివేయండి (2) ఒక కూపన్ మాత్రం పంపినచో ఇతర కూపనులను కొట్టివేయండి (3) ఎంట్రీరుసుము M O ద్వారా పంపినచో, పోస్టాఫీసునుండిపొందిన M O రసీదును ఎంట్రీ ఫారమునకు జతపరచవలెను M O రసీదు లేని ఎంట్రీలు నిరాకరింపబడును (4) I P O క్రాస్‌చేయవలదు అది లిట్‌క్విజ్ నెం 50 బొంబాయి—7 వారికి చెల్లించునట్లు ఉండవలెను

| 1 | | RUPEE ONE |
|---|---|---|
| 1 | BULLIED | SULLIED |
| 2 | CHARITY | PLENTY |
| 3 | DAMN | DISOWN |
| 4 | DEVELOPMENT | INVESTMENT |
| 5 | DUTY | LOYALTY |
| 6 | EXCEL | EXIST |
| 7 | EXPENSIVE | EXPLOSIVE |
| 8 | FAVOURS | FRIENDS |
| 9 | GRIEF | GUILT |
| 10 | ILLUSION | TRANSITION |
| 11 | INFIRMITY | INSANITY |
| 12 | INTELLECTUAL | SPIRITUAL |
| 13 | LEARN | TURN |
| 14 | MENTALITY | MORALITY |
| 15 | POLITICAL | SOCIAL |
| 16 | POWER | PURPOSE |
| 17 | ROMANCE | ROUTINE |
| 18 | THINKING | WINNING |

| 2 | | RUPEE ONE |
|---|---|---|
| 1 | BULLIED | SULLIED |
| 2 | CHARITY | PLENTY |
| 3 | DAMN | DISOWN |
| 4 | DEVELOPMENT | INVESTMENT |
| 5 | DUTY | LOYALTY |
| 6 | EXCEL | EXIST |
| 7 | EXPENSIVE | EXPLOSIVE |
| 8 | FAVOURS | FRIENDS |
| 9 | GRIEF | GUILT |
| 10 | ILLUSION | TRANSITION |
| 11 | INFIRMITY | INSANITY |
| 12 | INTELLECTUAL | SPIRITUAL |
| 13 | LEARN | TURN |
| 14 | MENTALITY | MORALITY |
| 15 | POLITICAL | SOCIAL |
| 16 | POWER | PURPOSE |
| 17 | ROMANCE | ROUTINE |
| 18 | THINKING | WINNING |

| 3 | | RUPEE ONE |
|---|---|---|
| 1 | BULLIED | SULLIED |
| 2 | CHARITY | PLENTY |
| 3 | DAMN | DISOWN |
| 4 | DEVELOPMENT | INVESTMENT |
| 5 | DUTY | LOYALTY |
| 6 | EXCEL | EXIST |
| 7 | EXPENSIVE | EXPLOSIVE |
| 8 | FAVOURS | FRIENDS |
| 9 | GRIEF | GUILT |
| 10 | ILLUSION | TRANSITION |
| 11 | INFIRMITY | INSANITY |
| 12 | INTELLECTUAL | SPIRITUAL |
| 13 | LEARN | TURN |
| 14 | MENTALITY | MORALITY |
| 15 | POLITICAL | SOCIAL |
| 16 | POWER | PURPOSE |
| 17 | ROMANCE | ROUTINE |
| 18 | THINKING | WINNING |

| 4 | | RUPEE ONE |
|---|---|---|
| 1 | BULLIED | SULLIED |
| 2 | CHARITY | PLENTY |
| 3 | DAMN | DISOWN |
| 4 | DEVELOPMENT | INVESTMENT |
| 5 | DUTY | LOYALTY |
| 6 | EXCEL | EXIST |
| 7 | EXPENSIVE | EXPLOSIVE |
| 8 | FAVOURS | FRIENDS |
| 9 | GRIEF | GUILT |
| 10 | ILLUSION | TRANSITION |
| 11 | INFIRMITY | INSANITY |
| 12 | INTELLECTUAL | SPIRITUAL |
| 13 | LEARN | TURN |
| 14 | MENTALITY | MORALITY |
| 15 | POLITICAL | SOCIAL |
| 16 | POWER | PURPOSE |
| 17 | ROMANCE | ROUTINE |
| 18 | THINKING | WINNING |

FREE TO SUBSCRIBERS WHO SEND 2 COUPONS — NO 50 — FREE TO ALL WHO SEND 4 COUPONS

### Subscribers Quiz

| | | | |
|---|---|---|---|
| BULLIED | SULLIED | DUTY | LOYALTY |
| CHARITY | PLENTY | EXCEL | EXIST |
| DAMN | DISOWN | EXPENSIVE | EXPLOSIVE |
| DEVELOPMENT | INVESTMENT | FAVOURS | FRIENDS |

3 MON HLY / 6 MONTHLY / ANNUAL SUB No /NEW

2 కూపనులు పంపు చందాదారు లందరికి ఉచితం




### MiniQuiz

| | | | |
|---|---|---|---|
| GRIEF | GUILT | MENTALITY | MORALITY |
| ILLUSION | TRANSITION | POLITICAL | SOCIAL |
| INFIRMITY | INSANITY | POWER | PURPOSE |
| INTELLECTUAL | SPIRITUAL | ROMANCE | ROUTINE |
| LEARN | TURN | THINKING | WINNING |

4 కూపనులు పంపువారందరికి ఉచితం

ఈ క్విజ్ ప్రవేశమునకు చెందిన నిబంధనలను, షరతులను పాటించుటకు అంగీకరిస్తున్నాను మరియు కాంపిటీషన్ ఎడిటర్ గారి నిర్ణయమును తుది నిర్ణయముగాను, న్యాయబద్ధమైనదిగాను అంగీకరించుటకు ఆమోదిస్తున్నాను ప్రతి కూపనుకు ఎంట్రీ ఫీజు రు 1/— ఈ పూర్తి ఎంట్రీఫారము (4 కూపనులకు) ఫీజు రు 4/—M O రసీదు/I P O/లిట్‌క్విజ్ క్యాష్ రశీదు/ప్రైజు కార్డు జతపరుస్తున్నాను. దాని నెం

50

ASV.

CAPITAL LETTERS

NAME ..........................................

ADDRESS ..........................................

ఈ పూర్తి ఫారమును కత్తిరించి పంపవలెను

ఆఖరు ముగింపు తేది 4—6—69
పొల్యూషన్ ఆంధ్రపత్రిక 8-6-69
* పొల్యూషన్ వెంటనే పొందుటకు 10 పైసల స్టాంపు, స్వంత అడ్రసుగల కార్డును వెంటనే పంపవలెను

లిట్ క్విజ్ నెం 48 లో ఒక్క ఆల్‌కరెక్టు ఎంట్రీకూడా రాలేదు ఒక్క తప్పుతో పంపిన 14 మంది మొదటి బహుమతిని పంచుకొని, ఒక్కొక్కరు రూ 1572 పొందిరి రెండు తప్పులతో 84 మంది ఒక్కొక్కరు రూ 120 పొందిరి 16 మంది మినిక్విజ్ విజేతలు మర్ఫీ ట్రాన్సిస్టర్ పొందిరి 47 మంది సబ్‌స్క్రైబర్స్ క్విజ్‌లో ఒక్కొక్కరు రూ. 53 పొందిరి లిట్ క్విజ్ వీక్లీ ఉచిత కాపీకి వ్రాయండి

## 2:1 లేక మాది మాకు...

2. నాగార్జునసాగర్ : ఈ ప్రాజెక్టు విషయంలో 'ఆంధ్రప్రదేశ్' ప్రభుత్వం వారు విచిత్రమైన పద్ధతిని అవలంబించారు. మొదట్లో జరిగిన ఒప్పందం ప్రకారం దీని మీద అయిన వ్యయాన్ని ఆంధ్ర - తెలంగాణా ప్రాంతాలు 3:2 నిష్పత్తిలో భరించాలి. కాని, 1969 లో 'ఆంధ్రప్రదేశ్' ప్రభుత్వంవారు ఈ నిష్పత్తిని 2:1 కి మార్చి వేశారు ఈ మార్పుకి ఆధారం ఏమిటో ఎవరికీ తెలియదు

శ్రీ కుమార్ లలిత్ నివేదికలో నాగార్జునసాగర్ ఖర్చుల వివరాలు లేవు 'ఆంధ్రప్రదేశ్' ప్రభుత్వం ప్రచురించిన అంకెలని బట్టి 1968–69 దాకా నాగార్జునసాగర్ ఆనకట్ట ఖర్చు రు. 77.4 కోట్లు. శ్రీ లలిత్ నివేదిక 1967–68 దాకా లెక్కలోకి తీసుకుంది. ఈ విశేషరికి 1968–69 లెక్కలు స్పష్టంగా దొరకలేదు కాబట్టి, పాత లెక్కలనే తీసుకోవటం జరుగుతున్నది

రు 77.4 కోట్లని 3:2 నిష్పత్తితో పంచితే ఆంధ్రప్రాంతానికి రు 46.4 కోట్లు, తెలంగాణాకి రు. 30 కోట్లు వస్తాయి. 2 : 1 నిష్పత్తి ప్రకారం ఈ కేటాయింపులు రు 51.6 కోట్లు రు. 25.8 కోట్లుగా మారుతాయి.

1968–69లో ఎంత ఖర్చుఅయిందో తెలియదు కాని మొత్తం ఖర్చులో కేటాయింపుల మార్పు వల్ల ఆంధ్రప్రాంతానికి తగిలిన అదనపు ఖర్చు రు. 5.2 కోట్లు తగ్గిపోతుంది.

ఇది 14 సంవత్సరాలకి సంబంధించిన మొత్తం. ఒక సంవత్సరం ఎక్కువ తీసుకున్నా పరవాలేదు. ఆంధ్రప్రాంతం అదనంగా భరించవలసిన ఖర్చు మొత్తం ఎంత తగ్గించినప్పటికీ రు. 3 కోట్లకి తగ్గదు.

* * *

దీనిని రకరకాల లెక్కల విశ్లేషణం జరిగింది. వాటి సారాంశం ఈ కింది విధంగా ఉన్నదని చెప్ప వచ్చు.

1. తెలంగాణా ప్రాంతంలో కాపిటల్, కార్పొరేషన్ల ఖర్చు కింద రు. 30 కోట్లు అదనంగా ఖర్చు అయిందని శ్రీ కుమార్ లలిత్ నివేదికే తెలుపు తోంది.

> ఎన్నో పద్దులలో 'ఆంధ్రప్రదేశ్' ప్రభుత్వం వారు తెలంగాణా ప్రాంతానికి ఎక్కువ మొత్తాలు కేటాయించారని శ్రీ లలిత్ నివేదిక వల్ల స్పష్టంగా తెలుస్తుంది.
>
> వీటిలో రెండింటిని మాత్రమే తీసుకుంటే (1. అమ్మకపు పన్ను, 2 నాగార్జునసాగర్) రు 33.0 + రు. 3.0 కోట్లు = రు. 36 కోట్లు అక్రమంగా తెలంగాణాకి జమ కట్టి నట్లు తెలుస్తుంది
>
> శ్రీ లలిత్ నివేదిక ప్రకారం తెలంగాణా 'మిగుళ్ళు' రు 34 కోట్లు.
>
> పై లెక్కల ప్రకారం రెండు పద్దుల కింద మాత్రం రు. 36 కోట్లయినా రద్దు అయిపోతాయి!
>
> అంటే ఆంధ్రప్రాంతం మిగులు కనీసం రు 2 కోట్లు ఉంటాయన్నమాట!

2 ఇవి పోగా రు 34 కోట్లు (సుమారుగా తెలంగాణా మిగుళ్ళ కింద శ్రీ లలిత్ నివేదిక తేల్చింది.

3. కాని ఈ 'మిగుళ్ళు' సరయిన లెక్కల మీద ఆధారపడినవి కావు.

4 చిన్న చిన్న విషయాలన్నిటినీ వదిలి వేస్తే ఈ రు. 34 కోట్ల నుంచీ ఈ కింది మొత్తాలు తీసివేయ వలసి వస్తుంది.

(అ) అమ్మకపు పన్ను రు. 33 కోట్లు.

(ఆ) నాగార్జునసాగర్ ఖర్చు జమ రు. 3 కోట్లు.

**5 అంటే, ఈ రెండు పద్దులే తెలంగాణా 'మిగుళ్ళు' కేవలం మిథ్య అని తెలుపుతాయి.**

### మిగుళ్ల సంగతి అలాగ ఉంచి తెలంగాణా ప్రాంతమే ఆంధ్రప్రాంతానికి రుణపడి ఉంటుంది !

ఒక ప్రాంతంవారిని ఎంత కాలమని మరొక ప్రాంతం వారు భరిస్తారు?

ఆర్థికంగా భరించడమే కాక భరించబడే వారి దూషణని కూడా ఎందుకు భరించాలి?

కలిసి ఉంటే సుఖం ఎవరికి?

—రాశి

[మరికొన్ని లెక్కలని గురించి వేరే వ్యాసం ప్రచురిస్తాము ]

### అమ్మకంపన్ను




రాజధానిలో వసూలు అయిన మొత్తం రు 49.6 కోట్లు

# కర్షకుడు

'కష్టించి భూమి దున్నినవాడు, ప్రార్థన చేసినవానికంటె పదివేల రెట్లు ఆస్తికుడు కాగలడు'

(జోరాష్టర్)

ఈ నాగరిక ప్రపంచములోని ముఖ్య వృత్తు లన్నిటిలోను వ్యవసాయమువలె, సాంఘిక, భౌతిక విజ్ఞానముపై తమ అభివృద్ధికి ఆధారపడియుండునవి వేరు లేవు. ప్రకృతితో కలిసి చేసే వృత్తి మరొకటి లేదు దాని ఫలితము — వ్యవసాయదారుడు సాంఘిక సున్నితములకు దూరమగుటయే— సంఘములో నేర్పరితనము తక్కువ, కళా నైపుణ్యము లేకుండుటయే—ఇతర సాంఘిక తరగతులకంటే.

ఇతరులపై తమ జీవనాధారముండు వారు, పరులను సంతృప్తిపరచుటయందు ఆరితేరి యుందురు. అది వారి వృత్తి. కాని భూమిపై జీవనాధారముండు వారు భూమిపైనే వారి దృష్టి కేంద్రీకరించాలి వారి విజ్ఞానము, నేర్పరితనము సంఘముపైకంటే భూమిపైనే వుపయోగించాలి. అందువల్లనే పట్టణవాసులు పల్లీయులను నగరవాసులకున్న సున్నితము లేనివారని నిందింతురు

స్వయంపోషకత్వముగల వ్యవసాయదారుడు తన కుటుంబ పోషణకు వలయు ఆహార పదార్థములను పండించుకొనగలడు. కొనుటకు, అమ్ముటకుగాని, ప్రయాణమునకు అవకాశములు, సదుపాయములు తక్కువైనందున అతనికి ఇతరులతో సంబంధము చాల తక్కువ

'నేను ప్రకృతి పనిముట్లతో భూమిని జయించి, దానిని మానవునిదిగా జేయు కష్టజీవి కావునే గౌరవింతును. అనేక కష్టములకోర్చి శ్రమించు మొద్దుచెయ్యిని గౌరవింతును. శీతోష్ణములకు లోనై చెమట కోర్చియున్న గరుకు ముఖమును గౌరవింతును — ఎందుకనగా మానవుని ముఖమే ఆతని వునికిని తెలియజేయును' ఓ! నీ అమాయకత్వమును ముఖ్యంగా గౌరవిస్తాను నిన్ను ప్రేమిస్తాను, దయ దలుస్తాను కఠినంగా చూడబడే సోదరా! మా అందరికై నీ వెన్ను వంగినది, మా కొఱకై నీకాళ్ల వేళ్ళు వికృతమైనవి, నీవు మా సైనికుడివి, మా యుద్ధాలను గెలిపించు భారము నీపైనున్నది—' అన్నాడు కార్‌లైల్.

కర్షకుడు స్వతంత్రజీవి కాని భౌతిక ప్రపంచములో అతనికంటే పారతంత్రుడు వేరొకడు లేడు అతివృష్టి, అనావృష్టి, వరదలు, తుఫానులు; వేళగాని జల్లులు, బీదబుతువులు, లెక్కలేనన్ని వెతలు కర్షకుని బాధించును, బంధించును శీతోష్ణ స్థితుల నుండి కాపాడుకొనుటయే గాక— కర్షకుడు, కలుపుమొక్కలు చీడపురుగులు, అడవి మృగములు, పక్షులు, చోరులు, పైరుచీడ, జంతు రోగాలను ఎదుర్కొని యుద్ధము చేయవలెను.

కర్షకుడు ఒక దృష్ట్యా స్వాతంత్రుడు అయినా వేరొక దృష్ట్యా పారతంత్రుడు. పట్టణవాసులను ఋణపీడించు వారినుండి కర్షకుడు స్వాతంత్రుడు. వేషములోని వింత వింత మార్పులు, మంచితనమును పోగొట్టుకొనుట, క్రొత్త పోటీ మార్గాల ననుసరించుట, ఆర్థిక దుస్థితుల నెదుర్కొనుట, ఇంకా అతనిని నేలకు త్రొక్కు అనేక పరిస్థితులనుండి కర్షకుడు స్వాతంత్రుడు. నగరవాసులగు వ్యాపారులు తమ కష్టాలనే తలంచుకొనుచు, గ్రామవాసుల స్వతంత్ర జీవనమును అసూయతో జూతురు. కాని కర్షకునికున్నంత విచారము శీతోష్ణ పరిస్థితి మార్పు గురించి వ్యాపారికి వుండదు. కర్షకుడు తన కడగండ్లనే తలచును కాని, నగరవాసుల సుఖజీవనమును గూర్చి ఈర్ష్య చెందడు.

మొత్తముమీద వ్యవసాయ వృత్తి అనేక ప్రకృతి చర్యలపై ఆధారపడియున్నప్పటికిని, రైతు, నగరవాసునికంటె స్వాతంత్రుడనియే చెప్పవచ్చును.

—ఎల్. మాల కొండయ్య



ఎపోల్లో—9 నుంచి బయటికి వస్తున్న డేవిడ్ స్కాట్‌ని అతని తోటి అంతరిక్ష నావికుడు లూనార్ మోడ్యూల్ నుంచి తీసిన ఫోటో. 'కింద' కనిపించే భూభాగం అమెరికాలోని మిసిసిపీ నది లోయ.

# కుక్కా వంట్లో బాగా లేదని…!

లోక్‌సభలో అస్సాము మార్పును గురించిన బిల్లును ప్రవేశ పెట్టిన నాడు ఎనిమిది మంది మంత్రులు రాలేదట. కారణం ఏమిటని అడిగితే ఓ మినిష్టరు (స్త్రీ) ఇచ్చిన సమాధానం చాలా సరదాగా వుంది నా కుక్కకు వంట్లో బాగులేదు. అందుకని రాలేదన్నారటామె.

*　　　*　　　*

కోటా బెలాద్ అనేచోట 72 ఏళ్ళహాజీఅలిక్ అనే అతను 14 ఏళ్ళ అమ్మాయిని వివాహం చేసుకున్నాడట. ఇతనికి పెళ్ళయి కాపరాలు చేసుకుంటున్న 32, 37 ఏళ్ళ కూతుళ్ళుకూడా వున్నారట పిల్లనిచ్చిన వారు, 'మా అల్లుడు చాలా మంచివాడు అమ్మాయిని




పువ్వుల్లో పెట్టి చూసుకుంటాడు' అన్నారట— మధ్య మనకెందుకు పోనిద్దురూ.

•　　　*　　　*

విజయనగరం మునిసిపలు స్కూలులో పదవ తరగతి పరీక్షలు జరుగుతున్నాయి. ఒక హాలులో పరీక్ష రాస్తున్న ఓ విద్యార్థిని చేతిలో చిన్న కాగితం చూసిన వాచరు ఆ కాగితాన్ని తన కివ్వమన్నాడట ఆమె వీల్లేదంటే, టక్కున లాక్కొని చూసి కొయ్యబారి పోయాడట కిమర్థం? అదొక ప్రేమలేఖ నీ ఫోటో నాకు పంపు అని ఆమె ప్రియుడామెకు రాసిన ప్రేమలేఖట అది.

# సహాయం-ఆంతర్యం

ఓ పేద కుటుంబానికి ఆర్థికంగా సహాయం చేసిన రామ్‌కిషన్ అనే 50 ఏళ్ళ నవయువ్వనుడు ఆ కుటుంబంలోని ఓ 13 ఏళ్ళ పిల్లని తన కిచ్చి




వివాహం చెయ్యమన్నాడట ఆమె తలిదండ్రులు ఆశ్చర్యపోయి, తేరుకుని వీల్లేదనేలోగా ఆమెని ఎత్తుకు పోయి బలవంతంగా వివాహం చేసుకున్నాడట. ఈ వివాహం చేసిన ప్రీస్టును, మరో వ్యక్తినీ, 50 ఏళ్ళాయన్ని పోలీసులు అరెస్టు చేశారట. ఇతను 'ది ధారా' గ్రామానికి చెందినవాడట. మగవానికి వయస్సుతో సంబంధం లేదని, అతను నిత్య యువ్వనుడనీ అన్నదెవరు! ఆయన కథలు చదివుంటాడా యీాయన! మేబీ .. మేనాట్బీ.

*　　　*　　　*

నీ క్రింద పని చేసే వుద్యోగస్తులకు (జీతంగాక) అదనపు విరాళంవంటిది కూడా యివ్వవలెను. అని రెండువేల అయిదువందల సంవత్సరాల క్రితం గౌతమ బుద్ధుడు అన్నాడనీ, అనేకశాఖలు— విధులు అనే




విభాగంతో యీ విషయంలో పురుడనీ—అనుక బుద్ధుడు బోనసు యివ్వడాన్ని ఆ కాలంలోనే ప్రవేశ పెట్టాడని బుద్ధజయంతి సందర్భంలో మాట్లాడుతూ మిస్టర్ పేరా అన్నారట. ఈయన సిలన్ హైకమీషనర్— ఢిల్లీలో వుంటున్నారు.

తన బరువు 238 పౌనుల నుంచి 128 పౌనులకు 30 వారాలలో తగ్గించుకున్న ఒకామె గుండె బలహీనతవల్ల చనిపోయిందట బాగా లావుగా వున్నవారు తమ లావు తగ్గడానికి తిండి తగ్గించుకుని సన్నబడడానికి ప్రయత్నిస్తారనీ, కానీ యిది చాలా ప్రమాదకరమనీ లాన్సెట్ అనే బ్రిటిష్ మెడికల్ పత్రిక రాసిందట. సౌతాంప్టన్‌కి చెందిన ఆ చనిపోయిన 20 ఏళ్ళఅమ్మాయి పేరు మాత్రం తెలియజేయ లేదుట ఆ పత్రిక.

# భార్యలు

ఆస్ట్రేలియాలో మగవారు— పెళ్ళి కావలసిన బ్రహ్మచారులు ఎక్కువై పోతున్నారనీ, స్త్రీలసంఖ్య తగ్గిపోయిందనీ కనుక అంతమంది బ్రహ్మచారులకూ




భార్యలు దొరకడం కష్టమని ఆ దేశం విచారిస్తోంది. భార్యలు కావలెను అని బోర్డు పెడితే మన దేశం సహాయం చేయకపోయేదా ఏమీ చాదస్తం గాకపోతే!

# రోజుకి ఏడుగురికి మానభంగం 80 నిమిషాలకి ఒకహత్యా

మెక్సికో రాజధాని మహానగరంలో రోజూ ఏడుగురు స్త్రీలు మానభంగానికి గురి అవుతున్నారని, 80 నిమిషాలకు ఒకరు హత్య గావించబడుతున్నారని పోలీసు శాఖ నివేదించింది.

*　　　*　　　*

ఇటీవల తమిళనాడులో జరిగిన ఎన్నికలలో మనప్పరై అనేచోట డి యం. కె. అభ్యర్థి ఆర్. కణ్ణుసామి ఒక్క ఓటు మెజారిటీతో గెలిస్తే ఓ స్వతంత్ర అభ్యర్థి పుదుక్కోట్టైలో నిలబడితే కనీసం ఒక్క ఓటు కూడా అతని పేర పడలేదట— పిల్లి. ●




ఎస్. పి, జగిత్యాల

**పురుషుల సమస్యలకంటే స్త్రీల సమస్యలు తొందరగా పరిష్కరింబడక పోవుటకు కారణం ఏమై ఉంటుంది?**

పురుష సమస్య ఒక్క పురుషునిదే. స్త్రీల సమస్యల్లో కుటుంబం అంతా ఇమిడి ఉంటుంది.

నానాజీ, లాలం కోడూరు

**మీరు జీవితాన్ని ఏమని నిర్వచిస్తారు ?**

తేలికగా—బ్రతకడం అని.

**మానవుడు సంపూర్ణతృప్తిని ఎప్పుడు పొందుతాడు?**

శాశ్వతంగా కన్ను మూసినప్పుడు. అతనితో పాటే అతని అసంతృప్త కోర్కెలూ కన్నుమూస్తాయి.

కె. బి హెచ్, నర్సీపట్నం

**ఆ మధ్య ఒక గొప్పకవి 'నింగీ నేలా కలిసినచోట ఇరువురమూ కలిసి పోదమా' అన్నారు. నింగీ నేలా కలవడం అసంభవం కదా? అంటే వారి కలయికకూడా అంత అసంభవమనా ?**

అంతదూరం ఆలోచించి ఉండరు భారతీ,...నాయకుని పెరట్లో బృందావన్ గార్డెన్స్, నాయిక ఇంట్లో కట్టేసిన చంద్రుడూ ఉండగా లేంది నింగీ నేలా కలిసే చోటు దొరకదా సిసీలోకానికి?

సి. హెచ్. ఏ. ఆర్, కొయ్యలగూడెం

**రచయిత్రులంతా నూటికి నూరుపాళ్లు ప్రేమకథలే వ్రాయడానికి కారణం?**

సాధారణంగా స్త్రీలు రొమాంటిక్స్. అంతకు మించి పెద్ద కారణం ఏముంటుంది?

పి. వి, నిర్మల్

**పిల్లలు పుట్టినప్పుడెంత ప్రేమతో చూస్తారో ఎదిగినకొద్దీ అంత ప్రేమతో ఎందుకు చూడరు ?**

గాడిదపిల్ల కోమలం అంటారు! పెరుగుతున్న కొద్దీ అసలు గుణాలు బయటపడుతూంటే తల్లీ తండ్రీ పిల్లల్ని క్రమశిక్షణలో పెట్టవద్దా?



ఎస్. ఎస్. కె, చిట్వేలి

**జీవితాన్ని అనుసరించి కోర్కెలు వస్తూంటాయి ? కోర్కెలనిబట్టి జీవితం మారుతూంటుందా ?**

జీవితాన్ననుసరించి కోర్కెలొస్తే బాగానే ఉండును....కాని కోర్కెల గుర్రాలకి మార్గాని కడ్డాలేదు, కళ్లేలకి బిగువూ లేదు. . . .

డి. ఎస్. ఏ, జైనాడ్

**ప్రకృతిలో ప్రాణి మనుగడకు ఆహారం ప్రధానంకదా ? జీవనాధారమైన ఆహారాన్ని ప్రసాదించే వాడు, జీవరక్షకుడేకాక దైవసమానుడు. ఆజన్మాంతం స్త్రీకి పురుషుడు ఆహారమిచ్చిన, పురుషుడు స్త్రీకంటే అధికుడుకదా ? యజమాని అదుపాజ్ఞలలో స్త్రీ మెదిలితే తప్పేముంది ?**

ఆహారమివ్వడమే ప్రధానమని అనుకుంటే మీలాంటి పదిమందిని పోషించకల స్తోమతు కూడ ఉంటుంది కొందరికి!! భార్యా భర్తల మధ్య 'పోషణ' కాదు ప్రధానం. 'తిండి పెడుతున్నాము' అంటే 'తగిన చాకిరీ చేయడం లేదా?' అని ఆడది అడుగుతే తప్పేముంది? 'పోషణే ప్రధానం అయితే పెళ్లెందుకు చేసుకోవడం—ఆవిధంగా తప్పించి చౌకలో బానిస దొరకదనా? స్త్రీపురుష ఆధిక్యతపట్ల మీ వూహలు చాలా మధ్యయుగపువిలా తోస్తున్నాయి. మళ్లీ కొంచెం ఆలోచించుకోండి పండిత మహాశయా!

పి. జి. జి, ఏలూరు

**మీరు తూగోజీలేకదూ మీ రచనలలో ఆ యాస కన్పించదేం ?**

అసలు భాషే తిన్నగా రాయలేక ఛస్తుంటే యాసకూడ ఎక్కడ రాయను గుప్తాగారూ?

ఎ. ఎస్. కె, రేపల్లె

**వరకట్న నిషేధం అనే సమస్యపై మీ అభిప్రాయం విడిగా వ్యాసంగా ప్రచురించ కలరా ?**

ఎందుకు చిట్టితల్లీ! ఆకొరివితో తలగోక్కోవడం? మద్యనిషేదం వరకట్న నిషేధం. . . . . యీనాడు ఒకే నావలో ప్రయాణం చేస్తున్న రెండు సమస్యలు. వాటిని కాలం తీర్చకల్గాలి గాని చట్టాలూ పోలీసులూ కారు.

జె. పి, జగిత్యాల

**వర్ణ, మత, కుల ప్రాంతీయ విబేధాలు రాను రాను పెరిగిపోతున్నాయి. దీనికి ముఖ్యంగా కారణం ఏదై ఉంటుంది ?**

పెద్దల డబుల్ స్టాండర్డు! తమకొక కొలబద్దా, సంఘానికంటూ యింకొక కొలబద్దా వాడుతారు వారు. స్వదేశంలో కులం గోత్రం మించిపోరు. విదేశాల కెళ్లి విశ్వమానవత్వం గురించి ప్రగల్భాలు పల్కుతారు. ఇటువంటి వారి మూలంగానే యువతరం గూడా దృక్పథ వైశాల్యం పోగొట్టుకుంటూంది.

వి. ఎస్. ఎన్. ఎమ్, దార్లపూడి

**పధ్నాలుగ్గసంవత్సరాల క్రిందట 1955 సంక్రాంతి సంచికలో మీ 'కనువిప్పు' కూ, ఇటీవలి మీ రచనలకీ అస్థమస్త కాంతరం అని నేనంటే మీరేమంటారు ?**

అక్షరాలా నిజం అంటాను ఉపసర్‌పంచ్‌గారూ, రచనల్లోనే కాదు శారీరకంగా కూడా మీ రన్నది నిజం, నిజం!!

డి. ఎస్. ఆర్. ఎల్. జి, కొత్తపల్లి

**కొంతమంది గృహిణులు గృహాన్ని అరణ్యంగా మార్చుకొంటున్నారు. కారణం?**

కేవలం చేతకాని తనం.

సి. ఎస్. పి, పిఠాపురు

**మనిషికి కోపం, ఈర్ష్య దేనివలన కల్గుతాయంటారు ?**

ఇన్ఫీరియారిటీ కాంప్లెక్సువల్ల.

**మనిషి తన గొప్ప చెప్పుకుంటూ ఎదుటి వారిని హేళన చేసేవారి నేమనాలి ?**

ఎదుటివాడెలాగా తను వెనుతిరగ్గానే ఆపనే చేస్తాడని కబోలు అలా చేస్తాడు! ఎందుకేమైనా అనాలి అలాంటి నేర్పరిని !

ఎస్. సి. ఎస్. ఆర్.

**ఆంగ్లంలో చోటు చేసుకొన్న తెలుగు పదాలేమైనా ఉన్నాయా ?**

లేకేం, బాండీ, బాండీకూట్ మన తెలుగే. వరండా కూడా నేను తెలుగుపదమే ఇంగ్లీషు కెక్కింది అనుకునేదాన్ని. కాని అది పోర్చుగీసు పదంట. ●

# ది ట్రోల్          గార్త్ బొమ్మలకథ




గార్త్ తిరిగి వచ్చేప్పటికి ఆలస్యం అవుతుంది...

—ఏమిటి ప్రొఫ్..... ఏమన్నా జరిగిందా? పెళ్లి ప్రెజెంటు ఏమి కావాలని జిమ్మీ ట్రెంట్ అడుగు తున్నాడు.

—ప్రెజెంటా?.... ఓ! అవును.... మంచి వాడు కాబట్టి అలా అంటున్నాడు.....

—అతనితో ఈ సంగతి చెప్పటంలో తప్పేమీ లేదుకదా?

—ఓయ్! ఏమయిందేమిటి?

—మనస్సేమీ బాగా లేదోయ్! అదే మేరియన్ విషయమే....




—డ్రిస్‌డేల్ రిసర్చ్ స్టేషన్‌లో పని చేస్తూ ఉంటానన్న సంగతి నీకు తెలుసు కదా?

— ఎందుకు తెలీదూ... ఏం గవర్నమెంట్ వారు గ్రాంట్‌ని ఆపేశారా ఏమిటి?

—అదేం లేదు... కాని, కొంతకాలం కింద ఒక పరిశోధన చేస్తూ ఉండగా ఒక కొత్త లోహాన్ని కనిపెట్టాను.... దానికి నా తోటివాళ్లు ల్యూమియమ్ అనే పేరు పెట్టారు.

—అది కొంచెం తనకి కావాలని మేరియన్ అడుగుతోంది. చాలా పట్టుపడ్తోంది!

—మేరియనా?




—ప్రొఫ్, ఈ ల్యూమియమ్ ఎందుకయినా పనికొస్తుందా? ముఖ్యమయినదా?

—లేదు.. దానికి విద్యుచ్ఛక్తికి సంబంధించిన, కొన్ని వింత గుణాలు ఉన్నాయి... ముందెప్పుడయినా పనికి రావచ్చు.... అందుకనే దానికి సంబంధించిన విధానాన్ని రహస్యంగా ఉంచుతున్నాను.

—మేరియన్‌కి ఆ పదార్థం దేనికి?

—అడిగినా చెప్పదు! తనకే తెలీదంటుంది!

—మేరియన్ అబద్ధాలు చెప్పే రకం కాదు... తనకే తెలియకుండా మనస్సులో లోతుగా నాటుకు పోయిన కోరిక, ప్రోద్బలమా ఇది?...

—లేకపోతే ఎవరయినా నాటారా?










ప్రొఫ్, నువ్వు దానిని బయటికి పెకలించాలి! మేరియన్ కోసమయినా లూమియమ్‌ని ఎందుకు కోరుతోందో కనిపెట్టాలి!

సరే.......

విమానం కూలినప్పుడు మతి స్థిమితం తప్పిందా?

—అయుండవచ్చు.....ఆలోచించిచూడు, రేప్పొద్దున మాట్లాడుదాము.

చీకట్లో చంద్రా కాచుకుని ఉన్నాడు...గార్త్ గదిలో దీపం ఆరిపోయిన అరగంట తర్వాత ...

—ఇప్పుడే!









వంటికి నూనె పట్టించాడు; నడుంచుట్టూ చిన్న గుడ్డ చుట్టాడు; డకాయిట్‌లాగ కిటికిలో నుంచి లోపలికి వచ్చాడు చంద్రా............

అతను కొంచెం గట్టిగా ఊపిరి పీల్చటంతో బిగించిన తీగలాగ ఉన్న గార్త్ చైతన్యాన్ని మీటినట్లయింది ..... కత్తి దిగింది !










మేలుకుంటూనే గార్త్ కత్తి పోటుని ఆపివేశాడు.

—ఆహ్‌హ్!

—వంటిమీద జిడ్డు వల్ల చంద్రా తేలికగా, గార్త్‌ని వదిలించుకున్నాడు ........

( —చంద్రా! మేరియన్ మనిషి! )

(ఇంకా ఉంది




వినీతమతి శీలపారమితను ఇలా వివరించాడు:

"వింధ్యారణ్యములో వేలకొద్ది చిలుకలకు రాజయిన హేమప్రభమనే ఒక చిలుక ఉండేది. దానికి చారుమతి అనే చిలుక ప్రతీహారుడు. ఆ చారుమతి వెంటి చిలుకను వేటకాళ్ళు చంపివేశారు. దాని విచారంవల్ల చారుమతి చాల చిక్కిపోయింది. విరహోన్మత్తమయిన ఆ చిలుకను చూచి చిలుకలరేడు ఒకమారు దానినినిర్మలమయిన ఒక సరస్సుకు పిలుచుకొని వెళ్ళి, ఆనీటిలో దాని ప్రతిబింబం చూపింది. తన నీడ దానినీడ నీటిలో కనిపించాయి.

అప్పుడు చిలుకలరేడు చారుమతితో "చూచావా, నీప్రియురాలు మరొకని సరసన కులుకుతూఉంది. ఆడజాతిసాయం సంధ్యవలె ముహూర్తమాత్రం అందమైనది, తర్వాత క్రూరంగా పరిణమిస్తుంది. తర్వాత ప్రళయావర్త భయంకరమైన చీకటిని చూపుతుంది. మూర్ఖులయిన వారిదారి ఎంత వెర్రిబాగులది! చేపలతోకలలాగ చంచలమైన స్త్రీల వెంట గతాను గతికంగా వెళ్ళుతుంది. స్త్రీవియోగానికి జనం మధ్యన దుఃఖపడుతున్న వారి శీలం జనానికి భయపడిందా అన్నట్టు విడిచిపోతుంది. తక్కిన గుణాలు కంకణ కేయూర కుండలాల వంటివి. శీలమొక్కటే, అకృత్రిమమైన వెలుగులో లావణ్యంవంటిది." అని ఉపదేశించింది.

"చారుమతి తన దొర హితవు విని, తన మనస్సును ప్రియా వియోగంనుంచి మరలించి శీలంపై లగ్నం చేసింది. దానికి దానితో మన్మథ వికారాలు అణగిపోయాయి.

"క్షాంతి పారమితను చెబుతాను విను.

కేదార పర్వతగుహలో శుభనందడనే మునీశ్వరుడు ఉండేవాడు. ఒకమారు దొంగలు తాము దొంగిలించిన ధనాన్ని రాజభటులు తరుముకొనిరాగా అతని గుహలో వదిలి పెట్టి పారిపోయారు. తర్వాత వచ్చి చూడగా, ఆధనం కనిపించలేదు. 'వీడు వట్టి దాంభికుడు. వట్టి దొంగవాని. దొంగలసొమ్ముకూడ దొంగిలించే చతురుడు.' అని కోపంతో అతని కాళ్ళుచేతులు నరికివేశారు. కళ్ళని పొడిచివేశారు.

"ఆప్రాంతపురాజు పేరు శేఖరద్యుతి.ఆతడు ఆముని శిష్యుడు. అతడు ఒకనాడు ఆ గురువుదర్శనం కోసం వచ్చాడు. ముని కాళ్ళు చేతులులేక కిందపడివుండడం చూచాడు. కోపంతో మండిపోయాడు. చారులద్వారా సంగతి తెలుసుకొని, ఆదొంగలను పట్టించి తెప్పించి, వారికి మరణశిక్ష విధించాడు.

"అంత జరిగినా మునికి కోపం కలుగలేదు. ఇంద్రియ నిగ్రహంకల ఆ ముని రాజును బ్రతిమాలి దొంగలకి మరణదండన ఆపించాడు. దొంగలు తమ దారిని వెళ్ళిపోయారు.

"అందువల్ల క్రమ అనేది శ్రమలేకుండా పొందే పుణ్యతీర్థం. ద్రవ్యవ్యయాడంబరంలేని క్రతువు. శరీరాన్ని శోషింపజేయని పరమోత్కృష్టమైన తపస్సు. ఎవరి హృదయంలో మహాఫల అయిన శాంతి లత ఉదయిస్తుందో, వారు పుణ్యానికి క్షేత్రం. యశస్సులకు పాత్రం.

"ఇక ధైర్య పారమితను వివరిస్తాను:

"దక్షిణా పథంలో మాలాధరుడనే బ్రాహ్మణ కుమారుడున్నాడు. ఒకమారు అతడు ఒక సిద్ధ కుమారుడు వేగంగా ఆకాశంలో వెళ్ళుతూండడం చూచాడు. అతనికి కూడా గగనంలో విహరించాలనే బుద్ధి పుట్టింది. తాటాకులతో రెక్కలు కట్టుకొని, ఉత్సాహంతో ఆకాశంలో ఎగరడానికి ప్రయత్నించాడు.

"అప్పుడు భగవాన్ కుమారస్వామి, ఆప్రాంతం మీదుగా వెళ్ళుతున్నాడు. ఆ విప్రకుమారుడిపై అతనికి దయ కలిగింది. అతనికి వ్యోమగమనం సిద్ధించేట్టు అనుగ్రహించాడు.

"ఉత్సాహ ధైర్యాలకు సిద్ధి స్వయంగా కలుగుతుంది ధర్మ వీర్యాలలో ఉత్సాహం సత్వ వృక్షానికి వేళ్ళ వంటిది."

"ధ్యాన పారమితను విను:— కర్ణాటదేశంలో

మలయమారి అనే వర్తకుడు ఉండేవాడు అతడు ఒకమారు, ఆ ప్రాంతపు రాజయిన ఇందుకేసర భూపతి కుమార్తెను చూచాడు. ఆమె పేరు ఇందుయశ. పేరుకు తగినట్లు ఆమె, అమందానంద నిష్యంద సుందరేందుని భావన. అలాటి సుందరాంగిని చూడగానే అతడు మదనపీడితుడయ్యాడు

కాని, సామాన్యుడైన వణిక్కు రాజకుమారిని పెళ్ళాడడం సాధ్యమా? ఆమె తనకు దుర్లభ అని అతడు నిశ్చయించుకొని ఒక చిత్రకారునితో ఆమె చిత్రం వ్రాయించి ఆ చిత్రఫలకాన్ని ప్రతిదినము పూజించేవాడు. అతడు సర్వవృత్తులా మాని తత్పరతతో ఆమెనే ధ్యానిస్తూ, రాగపరాయణుడై ఏదో లోకంలో విహరించినట్లు ఉండేవాడు. అతనికి అప్పుడు భావనలో, వాసనా లిఖిత అయిన ఆమె గాలికి కదలాడే లతవలె నడుస్తున్నట్లు కనిపించేది.

ఒకమారు అతడు ఆ చిత్రఫలకాన్ని తన నూతనోద్యానానికి తీసుకుని వెళ్ళి ఒకచోట పెట్టాడు. అప్పుడు, చంద్రోదయ సమయం. మలయమారి ఆ చిత్రపటంపూజకోసం కలువలు మొదలయిన పూవులు తెద్దామని బయలు దేరాడు.

ఆదారిని వినయద్యుతి అనే ఒక సుగతుడు వెళ్ళుతూ, అదంతా చూచాడు. ఆ మూఢునికి తగిన ఉపదేశం చేద్దామని, ఆ చిత్రఫలకంలో ఒక పామును గీచి వెళ్ళిపోయాడు. మలయమారి పూవులు కోసుకొని వచ్చాడు చిత్రపటంలో ప్రియురాలి పక్కన పాము ఉండడం చూచాడు. అదంతా నిజమేనని భ్రాంతి కలిగింది. ఆపాము ఆమెను కరిచినట్లు, ఆపాము కాటుకు ఆమె భూమిమీద పడి దొర్లుతున్నట్లు భావం కలిగింది.

"నిశ్చల ధ్యానంతో చూచాడు. సులోచన అనే తన ప్రియురాలు మరణించిందని నిశ్చయించుకొన్నాడు. 'హా! ప్రియురాలా! నామనస్సముద్రానికి చంద్రికవంటిదానా! ఎక్కడికివెళ్ళావు?' అని శోకిస్తూ, ఒక చెట్టెక్కి కిందికి దూకాడు ప్రాణత్యాగం చేద్దామని.

"వర్తకుని శోకాలాపాలు విని తిరిగి వచ్చినవినయద్యుతి, అతనిని రక్షించి, యథార్థం తెలియజేశాడు. 'ఆహా! ఎంత మూఢుణ్ణి ఇదంతా అసత్య భావనామాత్రం. ముద్దరాలికోసం అనన్య మనస్సుతో చేస్తున్న ఈధ్యానం ఈజన్మలో తత్త్వచింతలో ఉంటే, మళ్ళీ జన్మ అంటూ ఉంటుందా?' అని మలయమారికి కనువిప్పు కలిగింది.

తర్వాత మలయ మారి అర్హతులను దర్శించుకొని వారిపుణ్య శాసనంలో ఉంటూ, ఇచ్ఛా భయ, ద్వేషాలు తొలగి ఈ సంసారదుఃఖాన్ని తగ్గించుకున్నాడు.

ఒకమారు అతడు నిజంగానే ఇందుయశను చూచాడు. ఆమెను చూచి, విరక్తుడై, మాయ అనుకొని, కన్నీళ్ళు పెట్టుకున్నాడు రాజు ఇందుకేసరుడు ప్రశ్నించాడు, కన్నీటికి కారణ మేమిటని. మలియమారి జరిగిన సంగతంతా చెప్పాడు ధ్యానసంతృప్తుడై రాజుకు కూడా వైరాగ్యం ఉపదేశించి, అతనితోపాటు అడవులకు వెళ్ళాడు

"జ్ఞానులు సర్వేంద్రియాల వ్యాపారాన్ని లయం చేసుకొని ధ్యానయోగంతో భావించిన దానిని ఎదుటనే

చూడ గలుగుతారు.''

''చివరిదైన ప్రజ్ఞాపారమితను విను.

''సింహళ ద్వీపంలో సింహవిక్రముడనే దొంగ ఉండేవాడు. అతడు వృద్ధుడయిన తర్వాత, నరక భయం కలిగింది. ఆ నరకాన్ని తప్పించుకొనడానికి యుక్తి ఆలోచించాడు. — విష్ణువు, రుద్రుడు, ఇంద్రుడు— వీరిని పూజిస్తే, వారు నా భక్తిని లెక్క చేయరు. అందువల్ల చిత్రగుప్తుణ్ణి పూజించడం ఉచితం. ఇలా ఆలోచించి అతడు బుద్ధిమంతుడు గనుక చిత్రగుప్తుణ్ణి ఆరాధించడం ప్రారంభించాడు.

చేతిలో విలాసంగా పట్టుకొన్న కమలం కదిల కల లాంటి వ్రాతలతో జగత్తునే మార్చివేసే కాయస్థులకు నమస్కరించని వ్వారెవరు?

సింహవిక్రముడు తన దృఢ భక్తుడని చిత్రగుప్తునికి చాల నమ్మకం కలిగింది. అయినా, అతని భక్తి పరీక్షిద్దామని బ్రాహ్మణ వేషంతో అతని ఇంటికి వచ్చాడు.

సింహవిక్రముడు అతనికి సకలోపచారాలు చేసి, భోజనం పెట్టించాడు. అతడు ప్రీతుడై స్వస్తి వచనం చెబుతుండగా, ''బ్రాహ్మణోత్తమా, చిత్రగుప్తుడు తుష్టుడు కానీ!'' అని స్వస్తి వచనం పలుకమని కోరాడు. చిత్రగుప్తుడు అతని భక్తిని నానావిధాలుగా పరీక్షించాడు చివరకు భార్యను ఇమ్మని కూడా కోరాడు చిత్రగుప్త ప్రీతికోసం భార్యను బ్రాహ్మణునికి సమర్పించడానికి కూడా అతడు కష్టపడలేదు.

చిత్రగుప్తుడు పరమానందభరితుడై అతనికి స్వస్వరూపంతో ప్రత్యక్షమై వరం కోరుకోమన్నాడు. సింహవిక్రముడు, ''దేవా నాకు ఆయుస్సు ప్రసాదించు'' అని కోరాడు.

''నాయనా, నీ భక్తి సంతృప్తి పడ్డాను. కాని, క్షీణమయిన ఆయుస్సు తిరిగి రావడం కష్టం. అయినా, నీ కోసం ఒక యుక్తి చేసి, నీ కోరికను

## ...బృహత్కథామంజరి

తీరుస్తాను. నీకు హితం చేకూరుస్తాను. ఈ సముద్రం ఆవలి తీరంలో తరంగిణి అనే నదీ తీరంలోని తపోవనంలో రాజర్షి ఒకడున్నాడు. అక్కడ శివుని ఆజ్ఞవల్ల మృత్యువు బాధించదు. వత్సా, అక్కడికి వెళ్ళు.'' అని చిత్రగుప్తుడు అతనిని తరంగిణీ నదీతీరం చేర్చాడు.

సింహవిక్రముడు, ఆ తపోవనంలో వుంటూ, యమునికి దొరకకుండా తప్పించు కొన్నాడు. ఇలా వేయి సంవత్సరాలు గిడిచింది. అతనిని ఎలాగయినా లాక్కుపోదామని యముడు పన్నాగం పన్ని ఒక మాయాంగనను సృష్టించి తపోవనానికి పంపాడు. ఆ వనితపై వ్యామోహంతో వాడు నదీ అవతలి తీరానికి వచ్చాడు. యముడు ఇదే అదనని వాడిని తన పాశంతో లాగి, యమలోకానికి తీసుకొని వెళ్ళాడు.

యమలోకం చేరిన తర్వాత, చిత్రగుప్తుడిని పిలిచి, ''సింహవిక్రముని పుట్టుపూర్వాలు ఏవిటి?' అని అడిగాడు. ఆ కలంపోటుగాడు తన భక్తునికి ఇలాటి దుర్గతి వచ్చినందుకు చింతిస్తూ, 'ధర్మరాజా, ఇతడు ఒకనాడు ద్విజార్చన చేశాడు. అందువల్ల ఇతని పేరు మొదట నరకంలో లేదు. స్వర్గభోగం తర్వాత వుంది అందువల్ల మొదట ఈ దుర్గతి స్వర్గంలో వుండిరాని'' అని చిత్రగుప్తుడన్నాడు.

స్వర్గానికి వెళ్లి లింగార్చన చేయవలసిందని చిత్రగుప్తుడు తన శిష్యునికి రహస్యంగా చెప్పారు. సింహవిక్రముడు అలాగే చేసి తన కల్మషం పోగొట్టుకున్నాడు. శివార్చన వల్ల అతని పాతకాలన్నీ దహించుకొనిపోగా, పరిజ్ఞాన సమాధానం వల్ల అతనికి భవం (జన్మ)లేని విభవం కలిగింది.

''ఇలా దొంగ ప్రజ్ఞావంతుడు కావడం వల్ల కుశల స్థితి పొందడు. మానవులకు ప్రజ్ఞవినా, బంధువు మరొకటి లేదు.''

వినీతమతి నుంచి పారమితలను విని సోమశూరుడు కూడా వైరాగ్యం కలిగి ఆ తపోవనంలోనే తపస్వి అయ్యాడు.

ఇలా వుండగా, ఇందుకలశుడనే రాజు శత్రువులకు వోడిపోయి, మంత్రి పరివార సహితంగా వినీతమతి వున్న వనానికి వచ్చి తల దాచు కొన్నాడు. లక్కడ అతనికి దప్పిక అయింది. కాని, ఇంద్రుని మాయతో అడవి అంతా, చెట్లన్నీ వళ్ళు నీడ లేకుండా మోడువారి పోయాయి. నీళ్లు కరవై పోయింది.

వినీతమతి వారి దుస్థితి చూచాడు. తనొక పెద్ద జింకగా మారి, ఒక గుంతలో పడి మరణించి వారికి ఆహార మయ్యాడు. రాజపుత్రుడు— ఇందుకలశుడు అది నిజమైన మృగమాంసమని నిస్సంకోచంగా తిన్నాడు. వినీతమతి భార్యలు వెంటనే నిప్పులో పడ్డారు. రాజపుత్రునికి వారి మరణ కారణం తెలిసింది. అతడు కూడా అమాత్య సహితంగా నిప్పులో పడి ప్రాణాలు కోల్పోయాడు. సోమశూరుడు యోగంతో దేహత్యాగానికి పూనుకున్నాడు.

ఇంద్రుడు ఇదంతా చూచి, వారందరి త్యాగానికి మెచ్చుకొని, అంతా తన మాయ అని తెలియజేసి, ఎముకలు మాత్రమే మిగిలిన వారందరి మీద అమృతల వర్షం కురిపించి అందరినీ బ్రతికించాడు. వినీతమతి జీవంతోపాటు అపూర్వబోధిని పొంది మళ్లీ తన దివ్యమైన తపోవనం ప్రవేశించాడు. మునుపటి లాగే సకల జీవులకూ హితం చేస్తూ గడిపాడు.

కనుక, నా తండ్రీ, మరణించిన వారే మళ్ళీ కలుసుకొన్నారన్నప్పుడు, బ్రతికున్నవారు మీరంతా మళ్లీ కలుసుకోడంలో ఆశ్చర్య మేముంటుంది?'' అని వృద్ధ తపసి అన్న మాటలకు కొంత తేరుకొని, నాగరాజు శాపం వల్ల కలిగిన మూర్ఛను వదలిపెట్టాను. దుర్గాదేవికి నమస్కరించి, దక్షిణ దిక్కుగా పయన మయ్యాను. దారిలో ఈ శబరులు నన్ను పట్టుకుని కొట్టారు. నేను వారిలో చాల మందిని హత మార్చాను. దానితో నా ఒళ్ళు హూనా హూన మయింది. నన్ను శబరులు బంధించారు. నా పుణ్యాల లాగ వారు నన్ను నీ పాద సన్నిధికి తీసుకువి వచ్చారు.'' అని గుణాకరుడు తన వృత్తాంతం చెప్పాడు.

మృగాంకదత్తుడు తన మిత్రుని వృత్తాంతమంతా విని, అతని సమాగమానికి సంతోషించి, అవసరం వచ్చినప్పుడు సహాయానికి దుర్గా పిశాచిని పంపవలసిందని శబర రాజయిన మాయావటుణ్ణి కోరి, అతని వద్ద సెలవు పుచ్చుకొని, శశాంకవతిని స్మరిస్తూ నలుగురు మంత్రులతో పాటు ఉజ్జయినికి బయలు దేరాడు.

**(ఇంకా ఉంది)**









పురాణాల్లో కొన్ని శుభ లక్షణాలూ, కొన్ని అశుభలక్షణాలూ ఉంటాయి శుభ లక్షణాలుంటే మేలు కలుగుతుందనీ, అశుభలక్షణాలు కష్టాలకు చిహ్నాలనీ అనుకోవడం ఉన్నది అనుకోవడమే కాదు నమ్మకం కూడాను ప్రజల్లో యిలాంటి నమ్మకం కలిగించడానికి మనవాళ్లు వాటితో ప్రసిద్ధ వ్యక్తులకు సంబంధం కల్పిస్తారు ఆ దృష్టాంతం చూచి యయినా— ప్రజలు విశ్వసిస్తారనే ఆశయంతో.

భగవంతుని పూర్ణావతార మూర్తి అయిన శ్రీరాముడు పుట్టినదినం చాలా గొప్పది అయిదు గ్రహాలు ఉచ్ఛస్థితిలో ఉన్నాయి సూర్యుడు మేషరాశిలో ప్రవేశించాడు. ఎంతో శుభకరమైన దినం చైత్ర శుక్ల నవమి! అట్టి దినమున జనిమించి శ్రీరామచంద్రుడు ఎంతో సుఖజీవి కావలసి ఉన్నది కాని అలా కాలేదు తాను పాలించే రాజ్యం 'రామరాజ్యం'గా అన్ని యుగాలవారికి ఆదర్శప్రాయ మయింది. అతని రాజ్యంలోని ప్రజలు ఎంతో సుఖంగా వుండి హాయిగా కాలం గడిపేవారు ఎట్టి యీతి బాధలూ లేవు

ప్రజలందరికీ సౌఖ్యమే! కాని తనకు సౌఖ్యంలేదు 'బాల్యంలోనే రాక్షసులతో పోరు; వివాహానంతరం పరశరాముని ఎగిరింపు, పట్టాభిషేకం తలపెట్టగా వనవాసం! అడవిలో అనేక శ్రమలు! తర్వాత సతీ విరహం! లంకపైకి దాడి! శత్రువును జయించి, తిరిగి అయోధ్యకు వచ్చి పట్టం కట్టుకున్నా— సీతా పరిత్యాగం! తుదకు సరయూనదిలో పడి ప్రాణత్యాగం చెయ్యడమున్నూ. ఇది శ్రీరాముని కష్ట పరంపర !

శ్రీరామునితో పాటు. అతని వెంట నున్న సీతా లక్ష్మణులకు కూడా తీరని కష్టాలు సంభవించాయి

గొప్ప జాతకుడైన శ్రీరామునికీ, సీతా లక్ష్మణులకూ యిట్టి కష్టాలు కలగడానికి కారణ మేమిటి? అనే ప్రశ్న కలగడానికి అవకాశం లేకపోలేదు.

బహుశా కల్పితమే అనుకోండి దీనికి ఒక సమాధానం చెప్తారు కొందరు పెద్దలు—

పలువరుసలో దంతాలు విరళంగా— అంటే సందులు కలిగి వుండడం, నడుస్తున్నప్పుడు మువ్వ చప్పుడైన రీతిగా టిక్కు టిక్కుమని ధ్వనికావడం, తలవెంట్రుకలు చివరిభాగంలో చీలి వుండడం అశుభలక్షణాలనీ, అవి ఆ ముగ్గురిలోనూ కానవస్తున్నందున, వారు కష్టాల పాలయ్యారనీ సమాధానం

శ్రీరాముని దంతాలు విరళంగా ఉండేవట! లక్ష్మణుడు నడుస్తున్నప్పుడు కింకిణీ ధ్వని చేసినట్లు చప్పుడయ్యేదిట! సీతాదేవి తలలోని కేశాలు చివరి భాగంలో రెండుగా చీలి వుండేవట! దీనికే సమాణంగా ఈ శ్లోకాన్ని ఉదాహరిస్తారు —

'రామో విరళ దంతశ్చ
లక్ష్మణేపాద కింకిణీ,
సీతాయాః కేశ శ్చైధిల్య
మత స్తే వనదుఃఖితాః'

ఈ శ్లోకం ఎందులో వుందో, అది ఎంతవరకూ ప్రమాణమైనదో చెప్పలేము. దానిని గూర్చిన చర్చ అనవసరం! ఆ విధంగానే శ్రీరామాదుల యెడ ఈ అశుభ లక్షణాలు ఉన్నాయా? అనే చర్చ కూడా అనవసరమే! వారి సంగతి మనకు తెలియదు ఇవి అశుభ లక్షణాలని తెలుసుకోవడమే మన వంతు!

ఇవి అశుభ లక్షణాలనే చాలా మంది నమ్మకం! వాటిని గురించి నిర్ణయించేవారు శాస్త్రవేత్తలు! పెద్దలు చెప్పినది అంగీకరించడమే సామాన్యుని స్వభావం.






### జరిగిన కథ

కంట్రాక్టరు సుందర్రావుగారు అంఐశ్వర్య సంతను ఆయన భార్య శాంతమ్మ వారి ఇద్దరి కొడుకుల తర్వాతది కల్యాణి కల్యాణికి మౌళి తటస్థపడతాడు అతను పేదవాడు వాళ్ల పరిచయం ప్రేమగా మారుతుంది తండ్రి ఆమె కొక పెద్ద సంబంధం తీసుకువస్తాడు కల్యాణి ఇష్టపడలేదు కొంత డబ్బు తీసుకుని మౌళితో మద్రాసు పారిపోవాలనుకుంది ఇద్దరూ కలిసి మద్రాసు వచ్చేస్తారు కొద్దిరోజులకే ఇద్దరికీ మనఃక్లేశాలు వస్తాయి మౌళి కల్యాణిని అనుమానిస్తాడు కల్యాణి సుమిత్రవద్దకు వచ్చి ఆమె సహాయాన్ని కోరుతుంది సుమిత్ర మౌళి దగ్గరకు వచ్చి అతన్ని మనోవ్యధ నుంచి తప్పించాలని చూస్తుంది కల్యాణిపై అతని కోపాన్ని పోగొట్టాలన్న ప్రయత్నాలన్నీ వ్యర్థమవుతుంటాయి మౌళి కల్యాణికి చేరువవుతూనే దూరమవుతుంటాడు కల్యాణి దిగులు నానాటికీ హెచ్చవుతూ వుంటుంది కల్యాణి ప్రవర్తనని అపార్థం చేసుకొని ఆమెని ఉద్యోగం నుంచి తీసేస్తారు

## 13

పుస్తకాలు ముందేసుకుని కూర్చున్న మైథిలి అతి నెమ్మదిగా అంది

'ఇవాళ మా అన్నయ్య మీతో మాట్లాడతాట్ట !'

'దేన్నిగురించి ?'

అమాయకత్వం నటిస్తూ అన్నాడు నారాయణమూర్తి —

మైథిలిముఖం ఎఱ్ఱతామరపూవే అయింది.

'పొండి ! పెద్ద తెలియనట్లు...'

'పొమ్మంటే పోతాను — నాకు పెద్దా తెలీదు — చిన్నా తెలీదు —'

మైథిలి కనుబొమలు దగ్గిరకి లాక్కుని కోపంగా చూసింది —

'నా దగ్గిర కెమెరా లేదు నువ్వెన్ని పోజులుపెట్టి ఏం లాభం !'

మైథిలి పక్కున నవ్వింది

'మీకంతా ఆటలే ! ఇవాళ మా అన్నయ్య'

'ఊఁ !, మీ అన్నయ్య ?'

'మిమ్మల్ని అడుగుతాట్ట !'

'అడగమను —'

'అది కాదండీ !'

'కాదు'

'అబ్బ !' మూతి గుండ్రంగా ముడుచుకొంది మైథిలి

'ఎంత బాగుందో ? ఒక్కసారి ముద్దు పెట్టుకోవాలనుంది—'

మైథిలి చటుక్కున తల వంచేసుకుంది

'ఎంతల్లరి ?'

'నీ దగ్గిర కాకపోతే, ఇంకెవరిదగ్గిర అల్లరి చెయ్యను మరి ?'

'నాకు చాలా భయంగా ఉంది'

'దేనికి భయం ?'

'మా అన్నయ్యకి బోలెడు గర్వం. మీకు అంతులేని అభిమానం — మీ ఇద్దరిమాటల పర్యవసానం ఎలా ఉంటుందో ?'

'ఇప్పుడెందుకూ మాట్లాడటం ?'

'వచ్చిన ప్రతి సంబంధాన్నీ నే కాదంటూంటే, వాళ్ళుమాత్రం ఎంతవరకని ఊరుకుంటారు ? ఈ సంవత్సరం లోగా ఏదో ఒక సంబంధం ఒప్పుకు తీరవలసిందే నని పోరటం మొదలుపెట్టారు — ఆ పోరు పడలేక ఇంకొక్క రెండేళ్ళాగులే, మీరు చేసుకుంటా నన్నారని చెప్పేసాను అందుకే మీతో మాట్లాడతా నన్నాడు'

'అందులో మాట్లాడవలసిందేముంది ?'

మైథిలి బెదురు బెదురుగా చూసింది.

'ఏమో ?'

చేత్తో బల్లమీద వాయిస్తూ కాసేపు మౌనంగా కూర్చున్నాడు నారాయణమూర్తి తరువాత నవ్వుతో 'దేవిగారి ఆజ్ఞ ఏమని ? తమరికోసం నా అభిమానాన్ని వదులుకో మనేనా ?' అన్నాడు —

మైథిలి నొచ్చుకుంది

'ఛ ! మీ అభిమానం చంపుకోమనటం లేదు మీ ఆత్మాభిమానంతో పాటు మీ మైథిలిని కూడా మనసులో పెట్టుకుని మాట్లాడ మంటున్నాను'

'పిచ్చి మైథిలి ! నిన్ను మనసులో పెట్టుకోవట మేమిటి ? నా మనసంతా నువ్వే ఉన్నావు. నా ఆత్మవే నువ్వయి నప్పుడు, నా ఆత్మాభిమానం నిన్నుమించిన, దెలా అవుతుంది ? నాకు సాధ్యమైనంత వరకూ నా సమాధానాలవల్ల మీ అన్నయ్య మనసుకు నొప్పి కలుగనియ్యను ఏ రకంగా

నైనా నాచేత 'కాదు' అనిపించే ఉద్దేశం లోనే వాళ్లు మాట్లాడులోంటే మాత్రం నేనేం చెయ్యలేను'

'అంతకంటె మీరుమాత్రం ఏం చెయ్య గలరు లెండి—' కానీ, మీరులేని నా జీవితం ఊహించుకోలేక పోతున్నానండీ! ఉహుఁ! అసలుండదు—బ్రతుకుతే మీతో కలిసి— లేకపోతే అసలు బ్రతకను—'

'అదిగో! అదే మానుకోవాలి—ఆ పిచ్చి ఉద్రేకాలు నాకంత ఇష్టం ఉండవు ఇది జీవితం—నీ చేతుల్లోనూ, నా చేతుల్లోనూ లేదు. సాధ్యమైనంత వరకూ ప్రయత్నిస్తాం. అప్పటికీ కుదరకపోతే, జీవితంతో రాజీపడి ఊరుకోవాలి — అంతేకాని ఇలాంటి భావాలవల్ల ప్రయోజనం లేదు— మనం కావాలనుకొని, ఈ లోకంలోకి రాలేదు, పోవటమూ మన చేతుల్లోలేదు— దాన్ని మన చేతుల్లోకి తెచ్చుకునే అధికారం మనకి లేదు అలాంటి ఊహలు ఇక ముందు రానియ్యకు—'

మైథిలి కళ్లలో నీళ్లు నిండి పోయాయి

'అంటే? నేను మీ దాన్ని అయినా కాకపోయినా, మీకు పెద్ద బాధ ఉండదన్న మాట! అంతేనా?'

'నువ్వు నా దానివి కాకపోతే, నేను బ్రతికినా చచ్చినా పెద్దభేదం ఉండదు కానీ నేను చచ్చిపోతానని అనను, చావను'

మైథిలి బేలగా చూసింది నారాయణ మూర్తి కన్నీళ్లునిండిన మైథిలి ముఖాన్ని తన చేతుల్లోకి తీసుకుని ఆ కన్నీళ్లు తుడిచాడు

'చూడు, మైథిలీ! ఇంకొక్కసారి అందమైన కళ్లలో నీళ్లు కనబడకూడదు ఛ! ఛ! ధైర్యంగా నిలబడి కావలిసింది పొందాలికానీ, ఈ బేలతనమేవిటీ?'

అదురుతోన్న మైథిలి పెదవులమీద తన చూపుడు వేలితో మృదువుగా కొట్టాడు

నిలువునా పులకించింది మైథిలి— అతని చేతులను తొలగించి దూరంగా జరిగింది.

'నారాయణ మూర్తిగారూ!' వరండా నుంచి పిలిచాడు మైథిలి అన్న

భయపడ వద్దన్నట్లు మైథిలిచెయ్యి మృదువుగా నొక్కి వరండాలోకొచ్చాడు నారాయణమూర్తి 'కూర్చోండి—మైథిలి చెప్పింది...'

నారాయణమూర్తి మాట్లాడకుండా కూర్చున్నాడు

'మైథిలిని మరో రెండేళ్లు ఉంచాలంటారా?'

కష్టంగా ఉన్నట్లు అడిగాడు నారాయణమూర్తికి కొద్దిగా చిరాకు కలిగింది బేలగా ఉన్న మైథిలిముఖం కనిపించటంతో ఆ చిరాకు అణచుకున్నాడు—

'ఇంకో రెండేళ్లవరకూ నేను పెళ్లి చేసుకోవటానికి వీల్లేదు' మా నాన్నగారు చేసిన అప్పులు నాలుగువేలవరకూ ఉన్నాయి. అవి తీరుతేనేకాని పెళ్లి చేసుకోను'

'మీ సంపాదనతో అప్పులన్నీ రెండేళ్లలో తీర్చగలరా?'

అతని స్వరంలో హేళన నారాయణ మూర్తిని గుచ్చింది

అయినా శాంతంగానే 'అందుకే ప్రయత్నిస్తున్నాను' అన్నాడు—



# ఏది సత్యం?...

'ఒకవేళ రెండేళ్ళలో తీరకపోతేనో?'

'మరో సంవత్సరం పడుతుంది.'

'అప్పుడైనా ఎవరు చెప్పగలరు? ముందు మీ అప్పులు తీరాలి—అవి ఎప్పటికి తీరతాయో తెలీదు—ఆ తరువాతైనా మైథిలినే చేసుకుంటారని నమ్మకమేవిటీ?'

'కాగితంమీద రాసి స్టాంపుమీద సంతకం పెట్టి ఇమ్మంటారా?'

హేళనగా అడిగాడు.

మైథిలి అన్నయ్యకు కోపమొచ్చింది.

'ఈ డొంక తిరుగుళ్ళన్నీ దేనికి? కష్టం లేందీ మైథిలిని చేసుకోనని చెప్పరాదూ!' అన్నాడు కటువుగా—

'మీరు సూటిగా చెప్పచ్చుగా, నాలాంటి వాడికి పిల్లనియ్యమని—'

నారాయణమూర్తి లేచాడు.

మైథిలిఅన్న కోపంగా అన్నాడు.

'అంతకూ మీ సమాధాన మేమిటీ?'

'మీ ప్రశ్నేవిటీ?'

'మీరు మైథిలిని చేసుకుంటారా? లేదా?'

'చేసుకుంటాను—'

'ఎప్పుడు?'

'నాకు వీలైనప్పుడు—సాధ్యమైనంత త్వరలో—'

'అంటే? అదెప్పుడు'!

'నాకు తెలీదు.'

'అలా నిర్ధారణ లేకుండా చెప్తే ఎన్నాళ్ళని ఎదిగిన పిల్లని ఇంట్లో ఉంచుకోగలం?'

'అది మీ యిష్టం!'

నారాయణమూర్తి వెళ్ళిపోయాడు.

అతి జాగ్రత్తగా ఈ సంభాషణంతా వింటోన్న మైథిలి వెక్కివెక్కి ఏడ్చింది.

*  *  *

ఏదో నవల చదువుకొంటూన్న సుమిత్ర వళ్ళో తను తెచ్చిన పేకేట్ పడేసాడు వశౌళి—ఉలికిపడి ఆశ్చర్యపోతూ ఆ పేకేట్ విప్పింది—మైసూర్ సిల్కుచీర. తెల్లబోయింది.

'ఏవిటిది?'

'నీకోసం కొన్నాను—'

'ఎందుకు? నా కక్కర్లేదు—'

'కల్యాణికి నా సహాయం అక్కర్లేదు. నీకూ నా సహాయం అక్కర్లేదు—ఎవ్వరికి నేనక్కర్లేదు—' బాధగా అన్నాడు వశౌళి—

'కల్యాణి మీ సహాయం అక్కర్లేదని చెప్పిందా? అసలు మీరు సహాయం చెయ్యాలని చూసిందెప్పుడు?' శాంతంగానే అడిగింది.

'సహాయం చేద్దామనే వెళ్ళాను. డబ్బియ్యబోయాను. 'నాకేం అక్కర్లేదు—సుమిత్రకే చీరకొనుక్కోండి' అంది...'

సుమిత్ర వశౌళి ముఖంలోకి సూటిగా చూసింది.

'మీ మాటలు నిజమే కావచ్చు—కానీ ఇలా విడిగా కోట్‌చేస్తే అర్థం కావటం లేదు. సందర్భానుసారంగా వివరించండి—పాఠ్య గ్రంథాలలోలాగే జీవితంలో కూడా ప్రతి చేష్టా ప్రతి సంఘటనా, సందర్భానుసారంగానే గ్రహించాలి—' తెల్లబోయి చూసాడు వశౌళి—అతనికిప్పుడు అర్థమయింది—సుమిత్రను తను పూర్తిగా అర్థం చేసుకోలేదని.

'నిజమే సుమిత్రా! ముందు నాకు కోపమొచ్చింది శివరామయ్యగారింటికి నేను వెళ్ళొద్దని చెప్పినా వెళ్ళా నన్నందుకు—అందుకే డబ్బడిగినా లేదన్నాను. సుమిత్రకు చీర కొనాలన్నాను. అలా అంటే తనకు నొప్పి కలుగుతుందని నాకు తెలుసు—నొప్పించాలనే అన్నాను. కానీ, అలా ఉండలేక మళ్ళీ సాయంత్రం వెళ్ళాను తీరా, నేనియ్యబోతే తను వద్దంది—తనకు సరోజినిగారిచ్చారుట! నీకు చీర కొనమంది! చూడు! న్యాయమేనా ఇది?'

'కల్యాణి సాధారణంగా మిమ్మల్ని డబ్బడగదు—అంత లేకుండా ఎలా ఉందీ?'

ఆందోళనగా అడిగింది సుమిత్ర—

'ఉద్యోగంలోంచి తీసేసారుగా!'

'ఎందుకు?'

వశౌళిముఖం వడిలిపోయింది — సమాధానం చెప్పలేక పోయాడు—ముఖం పక్కకు తిప్పుకున్నాడు—

'కల్యాణి శివరామయ్యగారింటికెందుకెళ్తోంది?'

'ఆయనకు మళ్ళీ పక్షవాతం వచ్చిందిట! ఆయనకు చేసేవారెవరూ లేరని...'

'కల్యాణికీ ఆయనకూ పరిచయమెలా కలిగింది? ఇంతటి ఆత్మీయత ఎలా పెరిగింది?'

'అదే తెలీదు — భ్రమరాంబగారు రకరకాల ప్రచారాలు చేస్తున్నారు.'

'ఇవాళొక్కరోజుకి నన్ను క్షమిం



రండి. ఇప్పుడే భ్రమరాంబక్కయ్య దగ్గర కెళ్ళి సంగతి కనుక్కొస్తాను—'

వర్ధాళి సమాధానంకోసం చూడకుండానే లేచింది. లేచినప్పుడు వళ్ళో ఉన్న చీర వర్ధాళి కాళ్ళదగ్గర దుమ్ములో పడింది.

అహర్నిశమూ వర్ధాళి ధ్యాసలోనే ఉన్న సుమిత్రకు కల్యాణినిగురించి కనుక్కునే అవకాశం లేకపోయిందీమధ్య అతణ్ణి ఒంటరిగా వదిలేస్తే మళ్ళీ ఎక్కడ తాగుతాడోనని బెంగ—నాలుగుదాటాక కాని కల్యాణి స్కూల్ నుంచి రాదు అది సరిగ్గా వర్ధాళి వచ్చే వేళ—వ్యాకులపడుతూ శివరామయ్య గారింట్లోకి ప్రవేశించింది సుమిత్ర—

సరిగ్గా ఆ సమయంలో కల్యాణి శివరామయ్యగారికి బట్టలు మారుస్తోంది.

సుమిత్ర చటుక్కున కల్యాణిచేతిలో బట్టలందుకొని 'నే మారుస్తాను నువ్వు కూర్చో!' అంటూ కల్యాణిని కూర్చోబెట్టింది—సందడికి లోపలినుండి భ్రమరాంబ వచ్చింది.

'సుమిత్రా! ఎప్పుడొచ్చావ్! అలా రా! కూచుని మాట్లాడుకుందాం!'

'రానక్కయ్యా! బావకేం కావాలో చూసి, వస్తాను' తలైనా ఎత్తకుండా అంది సుమిత్ర—

దిమ్మెరపోయింది భ్రమరాంబ—

# ఏది సత్యం?...

'ఈవిడేనా, నీ స్నేహితురాలు! ఈవిడకేనా ఉద్యోగం ఇప్పించమన్నావు? భలే స్నేహితురాల్ని సంపాదించావు. ఉద్యోగమిప్పించినందుకు నాకు మంచి ఉపకారమే చేసింది. నా సంసారానికే ఎసరుపెట్టింది.'

'ఊరుకో అక్కయ్యా! ఆయనలా పడి ఉన్నారు. కల్యాణి నిండుమనిషి— ఇలా మాట్లాడటానికి నోరెలావస్తోంది నీకు? ఈ మాటలన్నీ నీ క్లబ్‌లో చెప్పు—నమ్ముతారు—నాకెందుకు చెప్తావ్?'

పాలిపోయింది భ్రమరాంబ కోపంతో ఆవిడ పెదవులు వణికాయి. సుమిత్ర ఊరుకోలేదు—'ఎక్కడికి బయలుదేరావ్? క్లబ్‌కేనా? బావ ఇలా ఉన్నా, నువ్వు క్లబ్‌లకు వెళ్ళగలుగుతున్నావు. ఆయనకు నిండు మనసుతో సేవ జేస్తున్న అమృతమూర్తిని ఆడిపోసుకుంటున్నావు — వద్దక్కయ్యా! వట్టి అబద్ధమని నీకు తెలిసే, ఇలాంటి మాటలు మాట్లాడకు — నీ ఇంట్లో నువ్వుండి నీ భర్తకు సేవ చేస్తానంటే కల్యాణి వద్దందా?'

భ్రమరాంబ కోపం అవధులు దాటింది.

'అవును నేను క్లబ్బులకే వెళ్తాను. నా ఇష్టం—ఈయనకు సేవలు చెయ్యటానికి ఈయన నాకేమవుతారు? ఏనాడు ఈయనను ప్రేమించాను నేను? వదిలిందే చాలనుకొని మా అమ్మా నాన్నా నాకు రెండింతలు వయసున్న ఈయనతో నా పెళ్ళి జరిపించారు. ఈయన డబ్బుని చూసి, నగలతో చీరలతో ఇన్నాళ్ళూ నన్ను నేను ఓదార్చుకున్నాను క్లబ్బులలో నా చీరల్నీ నగల్నీ ప్రదర్శించుకొని నా వెలితి నంతా వాటి మాటున దాచుకున్నాను. ఇప్పుడీయనకు నేను సేవచేస్తూ కూర్చుంటానా? చెయ్యను—ఒక్కనాటికీ చెయ్యను — ఇది పాపమా? అయితే కానియ్యి — ముందు ఇంతటి ముసలివాడికిచ్చి నన్ను చేసిన మా అమ్మా నాన్నలది పాపం! తగుదునమ్మా, అని నన్ను చేసుకున్న ఈయనది పాపం — వీళ్ళందరూ చేసిన పాపాలకు నేను శిక్షననుభవిస్తూ జీవితాంతం ఏడవనా? ఊహూ! ఏడవను— ఒక్కనాటికీ ఏడవను — ఎవరికి అందుబాటులో ఉన్న సుఖాన్ని వాళ్ళు న్యాయాన్యాయ విచక్షణ లేకుండా అందుకొంటూనే ఉన్నారు. ఇక నాకేనా ఈ నియమాలన్నీ? నేను క్లబ్‌కిపోతాను. ఈయన దగ్గరుంటే కోపం, అసహ్యం పట్టలేక, ఈయననైనా హత్యచేస్తాను. ఆత్మహత్యైనా చేసుకుంటాను—అందుకే పారిపోతున్నాను—'

భ్రమరాంబ విసురుగా వెళ్ళి కారులో కూర్చుంది. తెల్లబోయి వింటోన్న కల్యాణి దగ్గరగా వచ్చింది సుమిత్ర—

'కల్యాణీ! నిండు మనిషివి ఇంత శ్రమ పడలేవు ఇంటికెళ్ళు. నేను బావగారిని చూసుకుంటాను నువ్వెళ్ళు...'

'మరి వర్ధాళి...?'

సుమిత్ర నవ్వింది—

'ఆయనిప్పుడు తాగటం లేదు. ఇదివరకు నిన్ను మరిచిపోవటానికి తాగేవారు. ఇప్పుడు నిన్ను మరచిపోవటానికి నిన్ను ద్వేషించాలని తాపత్రయపడుతూ అది సాధించలేక ఊరుకొంటున్నారు—

కల్యాణి కళ్ళు సంతృప్తిగా నవ్వాయి—

* * *

ఎన్ని పనుల్లో ఉన్నా రోజూ ఏదో ఒక సమయంలో వచ్చి కల్యాణెలా ఉందో చూసి పోతుండేవాడు నారాయణమూర్తి—అతనీ మధ్య వారం రోజులుగా రాకపోయేసరికి అతనెలా ఉన్నాడోనని ఆందోళన కలిగింది

నువ్వు పక్క ఫ్లోర్ లో హీరోగా వేస్తే వేసుకున్నావ్ —కానీ మా సినిమాలో నువ్వు విలన్ అన్న సంగతి మరిచిపోతే ఎలా?



కల్యాణికి —

రిక్షా పిలిపించుకుని నారాయణమూర్తి గదికి వెళ్ళింది—

గదంతా చిందరవందరగా ఉంది-వళ్ళు తెలియని జ్వరంలో మంచంమీద పడి ఉన్నాడు నారాయణమూర్తి—ఉండి ఉండి సన్నగా మూలుగు తున్నాడు—

'నారాయణమూర్తీ!' జాలి నిండిన స్వరంలో పిలిచింది కల్యాణి—

నారాయణమూర్తి మండుతోన్న కళ్ళు తెరిచి కల్యాణినిచూసి ఆశ్చర్యంగా 'మీరే వచ్చారా? నేను రాలేకపోయాను' అన్నాడు.

నారాయణమూర్తిని ఆ స్థితిలో చూడ లేక కల్యాణి కళ్ళలో నీళ్ళు తిరిగి పోయాయి

'ఊళ్ళో అందరినీ ఆదుకొంటావు. నీ సంగతి నువ్వు చూసుకోవేం ?'

ఆప్యాయంగా అదలించింది.

నవ్వాడు నారాయణమూర్తి—

'మొండివాణ్ణి. బండవాణ్ణి — నన్ను రోగాలేం చెయ్యగలవు? అయ్యో! మీరీ స్థితిలో ఇంత అవస్థపడి ఎందు కొచ్చారు?'

'డాక్టర్ని పిలిపించావా ?'

'బాగుందండోయ్! డాక్టర్ని పిలిపిస్తే మళ్ళీ ఫీజిచ్చుకోవాలి — దండుగ! నేనే హాస్పిటల్‌కెళ్ళి వచ్చేసాను—'

'పోనీ. మందు తాగుతున్నావా ?'

'చూసారా? మర్చిపోయాను. ఇప్పుడు తాగేస్తాను' సీసాలోమందు గ్లాసులో పోసుకుని గడగడ త్రాగేసాడు—

'భలే చేదుగా ఉందండీ! మందంటె చేదుగా ఉండాలి కాబోలు!' నవ్వుతూ అన్నాడు నారాయణమూర్తి.

వళ్ళెరగని జ్వరంతో నా అనే తోడు లేక చేదుమందు తాగుతూ నవ్వుతోన్న నారాయణమూర్తిని విస్ఫారిత నేత్రాలతో చూస్తూ కూర్చుంది కల్యాణి. మనసులో 'ధన్యుడవు నారాయణమూర్తీ!' అను కుంది.

'కాఫీ అయినా త్రాగావా ?'

'అదీ మరిచిపోయానండీ! ఆ ఫ్లాస్కులో ఉన్నట్టుంది ఇందాక ఓ పని లేని ఫ్రెండ్ తెచ్చి పడేసాడు—'

లేవబోయాడు నారాయణమూర్తి—

'లేవకు కూర్చో!' ఆజ్ఞాపిస్తున్నట్లుగా అంది కల్యాణి. తాను లేచి గ్లాసులో

పోసిచ్చింది.

ఆ గ్లాసు అందుకుంటూ 'మనిద్దరిలో ఎవరికెక్కువ ఓపికుందో పందెం వేసుకుందామా?' అన్నాడు నవ్వుతూ.

'నారాయణమూర్తీ! ఇలా ఎప్పుడూ ఎలా ఉండగలుగుతున్నావో నాకు చెప్పవా?'

'మీ కళ్ళు ఎంతటి నీరసంలోను అంతగా వెలుగుతుంటాయెందుకో నాకు చెప్పరా?'

'నాకు తెలీదు అసలు నా కళ్ళు వెలుగుతుంటాయనికూడా తెలీదు—'

'నాకు తెలుసు ఎందుకో కూడా తెలుసు—ఆ కళ్ళలో వెలిగేది అందమైన మీ మనసు......'

'ఈ మనసుకి కూడా అంద చందాలుంటాయా?'

'ఉండేదే మనసుకి — మనసుకు లేని శరీరం మట్టి బొమ్మేగా! అట్లాంటి మట్టి మనుష్యులూ చాలామంది ఉన్నారు.'

'ఇంతకూ నీ జ్వరం గురించి మైథిలికి తెలుసా?' నారాయణమూర్తి చెప్పినప్పటినుండీ మైథిలి కల్యాణి దగ్గరకి వస్తూ పోతూ ఉంది. ఆ కారణంచేత మైథిలీ నారాయణమూర్తుల అనుబంధం కల్యాణికి అర్థమైంది.

'తెలీదు చెప్పలేదు. చెపితే వచ్చేస్తుంది. చుట్టుప్రక్కల వాళ్ళూ, వాళ్ళ వాళ్ళూ ఊరుకోరు. పిచ్చిది. ఏదో ఏదో మాట్లాడుతుంది. నన్ను చేసుకుని—ఏంసుఖపడుతుంది? నాలుగువేల అప్పు తప్ప ఇంకేముంది నాకు. వాళ్ళవాళ్ళు మాంచి సంబంధం చూసి ముడిపెట్టేస్తారు. మొదట కొంతకాలం ఏడుస్తుంది. ఆ తరువాత 'మా వారు నన్ను విడిచి ఉండలేరు. మా వారికి హిందీ సినిమాలంటే ఇష్టం —మావారు ఎంత బాగా కబుర్లు చెపుతారనుకున్నావ్? మావారిని విడిచి ఉండలేను బాబూ! వెంటనే వెళ్ళిపోవాలి—' అంటూ తయారయిపోతుంది.'

పకపక నవ్వాడు నారాయణమూర్తి.

కల్యాణి నవ్వలేదు.

'మైథిలి ప్రేమనంత తేలిగ్గా ఎందుకు తీసేస్తావ్ నారాయణమూర్తీ?'

'ఛ! ఛ! నేను తేలిగ్గా తీసెయ్యటం లేదు—చాలా బరువైనది. నన్ను చేసుకోలేనని తోచినప్పుడల్లా అయిదారు లీటర్ల కన్నీళ్ళు కారుస్తుంది. మైథిలి ప్రేమను శంకించటం కాదు. మానవ సహజ ప్రవృత్తిని వివరిస్తున్నానంతే!'

'మనుష్యుల్నందరినీ ఒక్కలా జనరలైజ్ చేసెయ్యటం మంచిదేనా నీకు? కొన్నాళ్ళకు మైథిలి అలా మారిపోతుందని నీ ఊహ! అలా కాకపోవచ్చు — నిన్నే తలుచుకుంటూ అటు భర్తకూ ఇటు నీకూ కాక కృశించిపోతుందేమో?'

'ఆ!, భావనలు వేరు—బ్రతుకు వేరు. బ్రతుకు బరువులో పడి భావనలణిగిపోతాయి.'

నిర్లక్ష్యంగా నవ్వాడు నారాయణమూర్తి.

కల్యాణి దీర్ఘంగా నిట్టూర్చింది.

'ఇదే స్త్రీకి పురుషుడికీ మధ్యనున్న ముఖ్యమైన భేదం — స్త్రీకి ప్రేమే జీవితం—పురుషుడికి ప్రేమ జీవితంలో ఒక భాగం—జీవితానందానికి ఒక ఉపకరణం—అందుకే స్త్రీ ప్రేమించగలిగినంత గాఢంగా పురుషుడెప్పటికీ ప్రేమించలేడు.'

నారాయణమూర్తి సమాధానం చెప్పలేదు. అతనికి బాగా అలసటగా ఉంది. అది గమనించింది కల్యాణి.

'వస్తాను నారాయణమూర్తీ' అని లేచింది.



శ్రీ కోరా కలంకారి చిత్రరచనలో సిద్ధహస్తులు కలంకారీ కళోద్ధరణకి ఆయన యథోచితమైన కృషిచేశారు. ఈ కళని చిత్రరచలో ప్రతిబింబింపజేయటం ఒక గొప్ప విశేషం ఇటీవల మద్రాసులో జరిగిన వారి చిత్రప్రదర్శనని పలువురు కళాప్రియులు మెచ్చుకున్నారు. అందులో ప్రదర్శించిన ఈ చిత్రం 'దేవదాసి'

'రోజూ రాకండి — ఈ స్థితిలో మీరు అనవసరంగా శ్రమపడటం మంచిది కాదు—' అన్నాడు.

కల్యాణి తిన్నగా మైథిలి దగ్గర కెళ్ళింది. ఎన్నడూ ఒకరింటికి రాని కల్యాణి తన దగ్గరకు వచ్చేసరికి సంభ్రమంగా ఆహ్వానించింది మైథిలి.

ముందు నిమ్మకాయ షరబత్ తయారు చేసిచ్చింది.

సొమ్మసిల్లిపోతున్న కల్యాణి ఆరసం త్రాగి 'ప్రియాప్రణయ సిద్ధిరస్తు—' అని దీవించింది.

మైథిలి సిగ్గుపడిపోయింది.

'మైథిలీ! నీకంత సంతోషకరం కాని వార్త తెచ్చాను—'

మైథిలి ముఖం పాలిపోయింది.

'ఏవిటి?'

'అదిగో!, అప్పుడే అలా అయిపోతే ఎలా? అందుకే నారాయణమూర్తి నీకు తెలియనీయద్దన్నాడు.

'ఆయనకు వంట్లో బాగుండలేదా?'

సర్వాంగాలూ వణుకుతుండగా అంది మైథిలి.

'అవును. జ్వరం కూడా బాగా తీవ్రంగానే ఉంది. కానీ, బాగా ఆలోచించుకో మైథిలీ! ఎట్లాంటి దుర్భర దారిద్ర్యంలోనయినా, ఎంతటి విషమ పరిస్థితులలోనయినా, అతనే కావాలని గట్టిగా నిర్ణయించుకుంటేనే వెళ్ళు. లేకపోతే వెళ్ళకు.'

మైథిలి పెదిమలు పళ్ళతో నొక్కిపట్టుకొని కన్నీళ్ళాపు కొంటూ నిల్చుంది. మైథిలిచెయ్యి ప్రేమగా నొక్కి వెళ్ళిపోయింది కళ్యాణి.

* * *

మరిగిపోతోన్న నుదుటిమీద చల్లని చెయ్యి ఆ చేతి మెత్తని స్పర్శలో ఏదో ఆత్మీయత—ఆ చేతివేళ్ళు నుదుటిమీద మెల్లిమెల్లిగా పాకుతోంటే బాధకు ఎంతో ఉపశమనం—

కళ్ళు తెరిచి చూసాడు నారాయణమూర్తి, మైథిలి—ఒక్క క్షణం అతని మనసేవిటో అల్లకల్లోలమై పోయింది.

'నువ్వెందుకొచ్చావ్! వెళ్ళిపో! నువ్విక్కడుంటే చూసేవాళ్ళకి బాగుండదు. త్వరగా వెళ్ళు—'

ఇదంతా మనసులో అనుకున్నాడు. పైకి వినడానికి శక్తి లేకపోయింది తన నుదుటిమీదున్న మైథిలి చెయ్యి పట్టుకుని బలంగా ముందుకు లాగాడు మైథిలి నారాయణమూర్తి గుండెలమీద వాలిపోయింది మైథిలి కళ్లలోంచి వేడి కన్నీళ్లు తుడుచుకొంటున్నకొద్దీ స్రవిస్తున్నాయి. నారాయణమూర్తి బలమంతా కూడదీసుకుని మైథిలిని గుండెలకు ఇంకా గట్టిగా అదుముకున్నాడు. ఆమె శిరసును తన కాలిపోతున్న పెదవులతో చుంబించాడు. చేత్తో వెన్నుమీద నెమ్మదిగా తట్టి బుజ్జగించాడు.

మనసులో చెప్పాలనుకున్నది మనసులోనే ఉండిపోయింది.

చీకట్లు దట్టమయ్యాయి.

'నువ్వింక వెళ్లు మైథిలీ!' అన్నాడు నారాయణమూర్తి నీరస స్వరంతో.

మైథిలి పెదిమలు బిగబట్టి 'ఉహూ!' అంది.

'ఇదేమిటీ? రాత్రికూడా వెళ్లవా?'

'మిమ్మల్నిలా విడిచి ఎలా వెళ్లనూ? నావల్లకాదు.'

'నీకు మతిపోయిందా మైథిలీ! రాత్రికి ఇక్కడే ఉంటావా? ఛ! ఛ! అలా మాట్లాడకు—వెళ్లు. అసలు నువ్విక్కడికి రావటమే అంత మంచిదికాదు. అందులో రాత్రి ఉంటానంటావేమిటీ?'

'పగలు కానీయండి—రాత్రి కానీయండి—మిమ్మల్ని ఈ దశలోవదిలి నేనువెళ్లలేను'

'వీల్లేదు మైథిలీ! నువ్వు వెళ్లిపో!' ఓపికలేని స్వరంతో ఖండితంగా అన్నాడు నారాయణమూర్తి.

మైథిలి నారాయణమూర్తి పాదాలను వాటేసుకుంది.

'నన్ను నమ్మండి. పట్టు—నేనిక్కడున్నంత మాత్రాన నన్ను పెళ్లి చేసుకోమని మిమ్మల్ని బలవంతపెట్టను. మీకు బోలెడు కట్నం తెచ్చే అమ్మాయినే పెళ్లి చేసుకోండి. నన్నుండనియ్యండి—తరమకండి—'

అతని పాదాలమధ్య ముఖం దాచుకుని వెక్కివెక్కి ఏడ్చింది.

నారాయణమూర్తి ఇంకేం మాట్లాడలేకపోయాడు.

(ఇంకా ఉంది)

# డా॥ హెచ్. ఎ. బి. పార్పియా

కేంద్ర ఆహార పరిశోధన సంస్థ (మైసూరు) డైరెక్టర్ డా. హెచ్. ఎ. బి. పార్పియా, క్రొత్తరకం ఆహార పదార్థాల్ని తయారు చేయడంలో చేసిన కృషి, జాతీయంగాను, అంతర్జాతీయంగాను వీరికి మంచి పేరు తెచ్చిపెట్టింది. వేరుశనగ పిండి, వేగించిన శనగ పప్పునుంచి బహుళ ప్రయోజనకరమైన ఆహారాన్ని తయారు చేయడంలో ఈ సంస్థ వారు సాధించిన విజయంలో డా. పార్పియా పాత్ర ఎంతైనా వుంది. గేదె పాలనుంచి శిశువులకి పనికొచ్చే ఆహారం తయారుచేసే పద్ధతిని వ్యాపార రీత్యా ఆచరణయోగ్యం చేయటానికి కూడా వీరు చాలా కృషి చేశారు. యిదే యిప్పుడు "అమూల్ బేబీ ఫుడ్" అనే పేరుతో అమ్మకం అవుతోంది.



డా. పార్పియా 1922 లో భోపాల్‌లో పుట్టారు బొంబాయి విశ్వవిద్యాలయంలో కెమిస్ట్రీలోను, మైక్రోబయాలజీ (సూక్ష్మజీవుల శాస్త్రం) లోను ఫస్టుక్లాసులో ఆనర్సు డిగ్రీ తీసుకున్నారు, అమెరికాలో కాలిఫోర్నియా, ఓరెగాన్ స్టేటు యూనివర్సిటీలలో యం ఎస్, పి హెచ్ డి డిగ్రీలు సంపాయించారు. ఫుడ్ టెక్నాలజీ, డైరీ సైన్సు (పాడి దినుసులకి సంబంధించిన శాస్త్రం) హార్టికల్చర్ (ఉద్యాన పెంపకం) లో ప్రత్యేక శిక్షణ పొందారు.

స్వదేశం తిరిగి వచ్చాక, డా. పార్పియా అనేక ప్రయివేటు ప్రభుత్వ సంస్థలలో పని చేశారు. 1962 లో దేశంలో, అత్యవసర పరిస్థితి ఏర్పడినప్పుడు, వారు రక్షణ విషయాలకి సంబంధించిన పరిశోధనల్ని నిర్వహించారు.

1962 లో అమెరికా జపాను పర్యటించిన జాతీయ ఉత్పత్తి సమితి బృందానికి డా పార్పియా ఉపనేత్రులు నాయకులు 1966 లో వార్సాలో జరిగిన రెండవ అంతర్జాతీయ ఆహార శాస్త్ర మహాసభలో, ఆహారోత్పత్తికి సంబంధించిన ఆర్థిక, సాంఘిక విషయాల సమావేశానికి చైర్మన్ పనిగా చేశారు. ప్రపంచ ఆహార, వ్యవసాయసంస్థ (ఎఫ్ ఎ ఒ), ప్రపంచ ఆరోగ్య సంస్థ (డబ్ల్యు. హెచ్ ఒ), ఐక్యరాజ్య సమితి శిశు సంక్షేమ సంస్థ (యూనిసెఫ్) వారు సంయుక్తంగా ఏర్పాటు చేసిన ప్రోటీను సలహా బృందానికి వీరు చైర్మన్ అమెరికాలో మెసాచుసెట్స్ యిన్స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ (యం ఐ. టి.) లో విజిటింగ్ లెక్చరర్

డా. పార్పియా దర్శకత్వంలో మైసూరులో ఆశియా దేశాలవారికి ఫుడ్ టెక్నాలజీలో శిక్షణ యివ్వబడుతోంది వీరు అనేక దేశాల్లో పర్యటించి అంతర్జాతీయ సమావేశాల్లో పాల్గొన్నారు అనేక ప్రచురణలు చేశారు

—డా॥ ఆర్. ఎల్. ఎన్. శాస్త్రి.



# స్వయంకృతం

సరస్వతీ బాబూరావ్

ఎంబాసిడర్ హారన్‌మోత విన్న సుజాత ఇంట్లోనుండి అరుగుమీదకు వచ్చింది. కారులోనుండి తూలుతూ దిగుతున్న భర్తను విస్మయంగా చూసింది. మరుక్షణమే ఖంగారుతో గబగబా మెట్లుదిగి వెళ్ళి సుందరానికి ఆసరాగా నుంచుని,

'ఏమయ్యిందండి? ఎందుకలా వున్నారు?' అంది వణికిపోతూ.

మూతలు పడిపోతున్న కనురెప్పల్ని తెరవటానికి ప్రయత్నించి విఫలుడయ్యాడు సుందరం. మరొక అడుగువేస్తూ తూలిపోతున్న సుందరాన్ని డ్రైవర్‌వచ్చి రెండవ వైపు పట్టుకొన్నాడు. అతి కష్టంమీద హాల్లోకి చేర్చారు సుందరాన్ని.

'నేను మేడమీదకు రాలేను' అస్పష్టంగా గొణిగాడు సుందరం.

'అలాగే. ఇక్కడే సోఫామీద పడుకోండి' అంటూ అతని తలక్రింద 'దిండునుపెట్టి సరిజేసింది.

సోఫాలో కళ్ళుమూసుకు పడుకొన్న సుందరం ఆ క్షణాన్న ఒక గ్రీకుశిల్పం మెరిసిపోతున్నట్లు కనిపించాడామెకి.

'భగవంతుడా! ఏమిటీ విపరీతం' అనుకొందామె

'అమ్మా. మీరేం బయపడకండమ్మా నేను వెళ్ళి మీ అన్నయ్యగార్ని తీసికొస్తాను. మీరు డాక్టరుకు ఫోను చేయండమ్మా' అంటూ డ్రైవరు బైటకు పరిగెత్తాడు.

ఆచేతనావస్థలోవున్న సుజాతకు అప్పటికిగాని తన కన్నీటితో చెంపలు తడిసిపోయిన సంగతి గుర్తు రాలేదు. చెంగుతో కళ్ళొత్తుకొని ఫోను వైపు వెళ్ళింది.

'సుజీ!' సుందరం నెమ్మదిగ పిలిచిన ఉలిక్కిపడింది సుజాత.

అతని ప్రక్కగవచ్చి కూర్చుంది. పరీక్షగ భర్త వైపు చూసింది. అతనేదో చెప్ప ప్రయత్నిస్తున్నాడు మూతలు పడిన కళ్ళను తెరిచేందుకు ఇబ్బంది పడతున్నాడు.

అప్పటికే పావుగంట గడిచిపోయింది! 'డాక్టరు వచ్చేస్తూ వుండాలి. బాధగా వుందా? ఎలావుంది? ఇటు చూడండి' అతడి ముఖాన్ని చేతుల్లోకి తీసికొని ఆప్యాయంగా ముందుకు వంగింది సుజాత. అతడేమీ మాట్లాడలేదు. తన కుడిచేతిని అతి కష్టంమీద జరిపి సుజాత చేతిని గట్టిగ పట్టుకొన్నాడు.

కాంపౌండ్‌లో ఎంబాసిడర్‌తోబాటు కాడిలాక్ కూడ ఆగింది. అయినా సుజాత లేవలేదు. భర్త సాన్నిధ్యం మరెన్నటికీ లభించదేమో నన్నట్లు అతడిని దగ్గరగ అనుకొని తన చేతిలోవున్న అతడి చేతిని ఆప్యాయంగ నిమురుతోంది. డాక్టర్ వస్తూనే 'ఏం జరిగిందమ్మా' అన్నాడు.

మెల్లిగ లేచి నిలబడింది సుజాత.

'ఆఫీసునుండి ఇప్పుడే వచ్చారు. మనిషి ఎలాగో వున్నారు. మాట్లాడటంలేదు. కనీసం చూడటమైనా లేదు డాక్టర్' అన్నది. అప్పుడామె కంఠం దుఃఖంతో పూడుకుపోయింది.

డాక్టరు ప్రక్కనే మానులా నిలబడివున్న అన్న శంకరాన్నిచేరి అతడి భుజంపై వాలిపోయింది సుజాత. పొంగివస్తున్న దుఃఖాన్ని ఆపుకొనేందుకు శతవిధాల ప్రయత్నిస్తోంది.

'నిబ్బరంగ వుండు. డాక్టరొచ్చేడుగా.

మరేం ఖంగారుపడకు. ఏం భయంలేదు. సరిగ్గా గంట — అంటే అరవై నిమిషాలు గడవనియ్యి. అరవై ఒకటో నిమిషంలో నీ మొగుడు నిన్ను కాఫీఅడిగి మమ్మల్ని మా దారినపొమ్మని గోలచేస్తాడు. ఓ.కె?' చెల్లిని సముదాయించే పద్ధతి క్షణంలో కనిపెట్టిన శంకరం మేధావి కావచ్చుకాని అంతమాత్రాన అతని అంతరంలో దిగులు ఛాయలు దూరంకాలేదు.

'శంకరంగారూ ! అమ్మాయిని అవతలకు తీసికెళ్ళండి. మీతో మాట్లాడాలి' అన్నాడు డాక్టరు'

శంకరం చెల్లెల్ని ప్రక్కగదిలో వుంచి డాక్టరు దగ్గరకు వెళ్ళాడు.

తనగదిలో సుజాత అన్నయ్య హామీ ప్రకారం నిమిషాలు లెక్కపెడుతోంది. అరవై నిమిషాలు కాకముందే — పదకొండో నిమిషానికే శంకరం శోకమూర్తిలా తన ముందు ప్రత్యక్షమైనప్పుడు సుజాత తత్తరపడింది.

'నా లెక్క తప్పింది చెల్లీ. మనకిక సుందరం లేడమ్మా' అన్నాడు.

ఎంతో సేపటినుండి నిగ్రహించుకొన్న ఆమె దుఃఖం యిక ఆగలేదు. కొంచెం సేపటికి వడలిన తోటకూర కాడలా చేతుల్లోనుండి పడిపోతున్న సుజాతను మరింత గట్టిగ పట్టుకొని 'సుజీ—సుజీ' అని కుదిపివేశాడు శంకరం ఆదుర్దాగా.

సుజాతకు తెలివి వచ్చేసరికి ఆమె తల వదినగారి వడిలోవుంది. ఏడ్చిఏడ్చి వదినముఖమంతా కందిపోయి ఎర్రగ వుంది. సుజాత చుట్టూ ఇరుగు పొరుగువారు పదిమంది వరకూ వున్నారు చుట్టూ వింతగ చూసింది సుజాత. వదినను చూస్తూ—

'ఏడుస్తున్నావా వదినా?' అని మాత్రమే అనగలిగింది.

'మనిషి ఎంత మంచివాడమ్మా. ఈ మాయదారి గుండెజబ్బు ఇంత చిన్న వయస్సులో ఎలా వచ్చిందోనమ్మా'

'మంచివాళ్ళకి దేవుడి పిలుపు యింత చిత్రంగానే వుంటుంది.'

'ఇక్కడకు వచ్చి ఆరునెలలు కాలేదు ఎంతమందికి ఎన్నివిధాల సహాయాలు చేశాడు.'

సుజాత చుట్టూ చేరిన ఆడవాళ్ళు తలొక విధంగా అనుకొంటున్నారు.

సుజాత లేచి కూర్చుంది. భర్తకు ప్రమాదమని తెలిసిన క్షణంలో వున్న భయం ఇప్పుడు లేదు. అప్పుడు ఏదైతే జరుగకూడదని ఊహిస్తూ భయపడి ఏడ్చిందో—అది తు. చ. తప్పక జరిగి ఇంతమంది తనని సముదాయిస్తున్న సమయంలో తనకు దుఃఖం రావటంలేదు.

వదిన యింకా ఏడుస్తూనే వుంది. సుజాత కంటిలో నీటిచుక్క లేకపోవటం ఆమెకు భయం కలిగించింది. ఆమె లేచి శంకరం దగ్గరకు వెళ్ళింది.

సరిగ్గా అప్పుడే తుఫానులా దూసుకు వచ్చింది రేణుక. వచ్చి అన్నది.

'ఎంతఘోరం జరిగిపోయింది సుజాతా! మీకింతకష్టం జరుగుతుందని నేననుకోలేదు.'

సుజాత రేణుకవైపు కన్నార్పకుండ చూసి 'కూచోండి. ఈ కష్టం చాల కష్టంగా వుంది. పాపం! మీకూ బాధగానేవుంది. బాధపడేవాళ్ళు నాతో డజనుమంది వున్నారు ఈ గదిలో ఏడవకండి రేణుకా. ఏంచేస్తాం ? జరగకూడనిది జరిగిపోయింది. వదినా మా అందరికీ కాఫీ పట్టా...'

సుజాత మాటలధోరణి విన్న అమ్మలక్కలు మరింత కలవరపడ్డారు. ఏం చేయాలో ఒక్కరికి తోచిందికాదు.

రేణుక సుజాతకు చేయి అందించి అన్నది. 'నెమ్మదిగ లేవండి' సుందరం గార్ని చూద్దాం.'

యాంత్రికంగ లేచిన సుజాత భుజంపై చేయివేసి శవం వున్నచోటికి తీసికెళ్ళింది రేణుక.

అప్పటికే సుందరానికి అంత్య సంస్కారాలకు కావల్సిన ఏర్పాట్లు జరిగిపోతున్నయి. కొత్తబట్టలు, తలంటి పోసికొన్నతల ముఖాన నామంతో పడుకొన్న సుందరం కొత్త పెళ్ళికొడుకులా వున్నాడు. అగరు వాసనలతో ఆవరండా అంతా నిండివుంది. ఆఫీస్‌స్టాఫ్ చాలమంది వచ్చి నిలబడ్డారు

సుజాత కివేమీ పట్టలేదు. నెమ్మదిగ అడుగులో అడుగువేసి కొంటూ రేణుకతోపాటు వచ్చి శవం ప్రక్కనే కూర్చుంది. గుండెల్లో దాగిన బరువంతా గొంతుకలో చేరగా కుప్పలా కూలిపోయింది సుజాత.

'లే తల్లీ. నువ్వెంత యేడ్చి ఏంలాభం చెప్పు. రా...అమ్మా. నా తల్లివికదూ.' ఒకప్రక్క ఏడుస్తూనే ఆడపడుచును సముదాయిస్తోంది వదిన

'నేను మాత్రం ఎందుకు బతకాలి వదినా' ఏడుస్తూ వదినను కౌగలించుకొంది సుజాత.

శంకరం వచ్చి సుజాతను బలవంతంగ ఇవతలకు తీసుకు వచ్చాడు. కొంచెంసేపటికి దుఃఖం ఉధృతం తగ్గిన తర్వాత అన్నను అతుక్కొని నిలబడిన సుజాత—

'అన్నయ్యా అప్పుడే తీసికెళ్ళటమేమిటి? మా వాళ్ళెవరూ రాలేదుగా. అందర్నీ రానివ్వు.' అంది ఆశ్చర్యంగా అప్పుడే ఈలోకంలోకి వస్తూ.

'అలా చేయాల్సి వచ్చింది మరి, ఇప్పుడిక టైమ్‌లేదు.'

'వీల్లేదన్నయ్యా! కనీసం మా వారి అన్నగారైనా వచ్చేవరకూ వుండనీయ్. వారొక్కరూ వచ్చే వరకు మా వార్ని తీసికెళ్ళకు. ఈ పొరపాటుని ఆయన క్షమించరు. జన్మలో నన్ను క్షమించరు' అంది ఆవేశంగా.

'అమ్మాయ్ నేను నీ అన్నని. నీవు నా ప్రాణానివి. నేను అన్నీ ఆలోచించే ఈ ఏర్పాట్లు చేశానమ్మా. సుందరం దహన సంస్కారాలు ఎంత త్వరగ అయితే అంత మంచిది. నన్ను బలవంత పెట్టకు. ఇంకేమీ అడక్కు.' ఖచ్చితంగ వచ్చిన ఆ మాటలు విని మరి మాట్లాడలేదు సుజాత.

* * *

మేడపైన గదిలో పడుకొన్న సుజాత కిటికీలో నుండి నిశ్చలంగ బయటకు చూస్తోంది. ఆచూపులో జీవం లేదు. కళ అంతకంటె లేదు. నిస్తేజంగ, నిర్లిప్తంగ చూస్తున్న ఆ చూపులో ఆమె భావం ఎవరికీ అర్థంగాదు. సుందరం పోయి వారం కావస్తోంది. ఈ వారం రోజులూ ఆమె పరిస్థితి యిలాగే వుంది. ఎవరు పిలిచినా పలుకదు. ఏమీ తినదు. పూటపూటకు ఆమెతో భోజనం చేయించటం శంకరానికి ప్రళయమైపోతోంది.

సుజాత మనస్సంతా శూన్యంగా భారంగా వేదనగా వుంది గతంలోని జ్ఞాపకాలు మనస్సును కలిచి వేస్తున్నయి.

తను బి. ఏ. లో వుండగానే తండ్రి

ఎన్నో సంబంధాలు తెచ్చాడు. అందులో చాలమంది ఆయనిచ్చే కట్నంపై మోజుతో తప్ప సుజాతపై అభిమానంతో కాదన్న వంగతి సుజాత బాగానే గ్రహించ గల్గింది. అలాటి వ్యక్తులతో తాను సుఖపడలేనని తెలిసి కొంది. అందుకే తండ్రితో వద్దని చెప్పింది.

'నాన్నా. నాకు అందంలేదు. కాని ఐశ్వర్యం వుంది డబ్బుకి మోహం వాచే వాళ్ళని నన్ను పెళ్ళిచేసికో మనడం భావ్యంకాదు నా డబ్బును ప్రేమించే మనిషిగాక నన్ను ప్రేమించే మనిషే నాకు భర్తగా కావాలి. నాకు అందం లేకపోవచ్చు కాని హృదయముంది నాన్నా' అంది

ఆ తర్వాత తండ్రి అమె నెన్నడూ పెళ్ళి విషయమై బలవంత పెట్టలేదు. మళ్ళీ సంవత్సరానికి ఆ ఊరికి ఉద్యోగ రీత్యా వచ్చిన సుందరంతో—ఒక పార్టీలో పరిచయమైంది. అందమైన సుందరం సుజాత కంఠస్వరాన్ని తెగ మెచ్చుకొనేవాడు. ఆమె మాట్లాడుతుంటె గండుకోయిల పాడినట్లు, వీణ మీటినట్లు వుంటుందని ప్రశంసించే వాడు అప్పట్లో అమె తన వివరాలేమీ సుందరానికి తెలియకుండ జాగ్రత్త పడింది. కొన్నాళ్ళ తర్వాత ఒక సంధ్యాసమయింలో అతడి దగ్గర తన వివాహ ప్రసక్తి తెచ్చింది. అతడు చిరునవ్వు నవ్వాడు.

'నేను డబ్బుగల వాడినికాను. నా కున్న

# స్వయంకృతం

ఆస్థంతా నా ఉద్యోగం. ఈ ఉద్యోగం మనిద్దరినీ బ్రతికించుకో గలదు ఇది చాలు. ఏ మంటారు?' అన్నాడు.

'నేనూ అంతే. నా డిగ్రీతో మీకు సహాయ పడగలననే అనుకొంటున్నాను కాని మీలో వున్న అందం నాకులేదు'

'నిజానికి అందమైన వాళ్ళంటే నాకూ ఇష్టమే, కాని మనసు పరంగ మీ రెంతో నచ్చారు.'

వివాహం జరిగిన తర్వాత సుందరంతో అతడి ఇంటికి వెళ్ళింది కాని కొద్ది రోజుల్లోనే తన తప్పు తెలిసి కొంది. ఏ ప్రేమనయితే తన భర్త నుండి కోరుకొందో అది తనకు అలభ్యమే అయ్యింది. పైగా తన డబ్బుకోసమే తనను వివాహం చేసి కొన్నాడని తెలిసికొన్న రోజున కుమిలి కుమిలి యేడ్చింది. సుందరం తెలివిగలవాడు. సుజాత పుట్టుపూర్వోత్తరాలన్నీ సేకరించి ఏమీ ఎరగనట్లు నంగనాచిలా నటించి అమెను భార్యగాచేసి కొన్నాడు.

అతడి ప్రేమకోసం ఆమె అలమటించి పోయింది. ఏనాటికైనా అతడి హృదయంలో స్థానం లభిస్తుందేమోనని రోజులు, నెలలు సంవత్సరాలు ఎదురు చూసింది. డబ్బుతో అతడిని బంధించాలనీ. వలపుతో లాలించాలని చూసింది. ఫలితంగ అతడికి మరింత దూరం అవుతూ వచ్చింది. అందమైన అతడి ముఖాన్ని... ఆకర్షణీయమైన ఆ విగ్రహాన్ని చూస్తూ ఎన్నో రాత్రులు నిదలేకుండ గడిపింది. వెన్నల్లా కనిపించే అతడి గుప్పెడు రాతి హృదయం మాత్రం కరుగలేదు. అతడు దూరమవుతున్న కొద్దీ అతడిని దగ్గర చేసుకోవాలనే సుజాత కోర్కె బలీయ మవుతూ వచ్చింది.

'సుజీ, ఏం చేస్తున్నావమ్మా' ముదువుగా అడుగుతూ వచ్చి ప్రక్కనే కూర్చున్నాడు శంకరం.

'ఏమీ లేదన్నయ్యా' లేచి కూర్చుంటూ అంది.

'చూడమ్మా, నీ విలా మంచంపడితే నేనేం కావాలి చెప్పు. నిన్ను కళ్ళలోపెట్టి చూసుకొనే మీ వదినా నేనూ వున్నాం. నీ విలా వుంటే మాకేమీ కాళ్ళాడటం లేదు. నిన్ను ఏది అడగాలన్నా అడగలేక పోతున్నా'

మాటేగ అతడి కళ్ళల్లోకి చూస్తూ అన్నది సుజాత.

'ఏమైనా అడగదలిస్తే అడుగు.'

చెల్లెలిని నిదానంగ చూస్తూ—

'ముందు నాకు నువ్వొక మాట యివ్వాలి.'

ఏమిటన్నట్లు చూసింది.

'ఏ పరిస్థితులలోను నువ్వు ఎలాంటి అఘాయిత్యం చేయనని మాటివ్వు.'

పేలవంగ నవ్వింది.

'అలాటి ఉద్దేశ్యమే వుంటే అన్నయ్యా! నేను మా వారితో సహగమనం చేసేదాన్ని.'

కొంచెంసేపు ఇద్దరూ మాట్లాడలేదు.

'చూడు సుజీ. నిన్నొకటి అడగాలను కొంటున్నాను సుందరానికి నీకూ ఈ మధ్య ఏమైనా కలతలు వచ్చాయా? అతడే మైనా బాధపడుతున్నట్లు కనిపించాడా?'

చిత్రంగా చూసి లేదన్నట్లు తల తిప్పింది.

'మరి ఎందుకలా చేశాడు?' తనలో తను అనుకొన్నట్లు అన్నాడు.

'ఏం చేశారు?' ఆదుర్దాగా అడిగింది.

నిశ్చలంగ ఆమె వంక చూశాడు శంకరం. తర్వాత—

'అతడు ఆత్మహత్య చేసికొన్నాడమ్మా' అన్నాడు

'అదేమిటి? మరి గుండెజబ్బు......'



'ఆత్మహత్య చేసికొన్నాడని తెలిస్తే నవాలక్ష ఆమాకీ అపసరమని అలా చెప్పేము.' శవాన్ని ఎక్కువసేపు వుంచక పోవడానికి కూడ కారణం అదే.'

స్థాణువులా కూర్చుండిపోయింది సుజాత.

'సుజాతా! నీ కోసం రేణుక వచ్చిందమ్మా' వదిన వచ్చి చెప్పింది.

'లోపలికిపంపు వదినా' సుజాత గుండెలపై చేయివేసి గట్టిగా పట్టుకొంది వణుకుతూ.

'ఆయనెందుకలా చేశారన్నయ్యా' అంది.

'అదే తెలియటంలేదు. డాక్టర్... నీవూ.. నేనూ...మన ముగ్గురి మధ్య రహస్యం వుండిపోవాలి జాగ్రత్త పెదవి దాటితే ప్రమాదం.' భుజంపై తట్టుతూ లేచాడు.'

రేణుకను చూసి శంకరం బయటకు వెళ్ళాడు

మోకాళ్ళపై తల పెట్టుకొని కూర్చుని వుంది సుజాత రేణుక మంచం దగ్గరిగా స్టూలు లాక్కొని కూర్చొంది

'నేను మీకు ఒక విషయం చెప్పాలని వచ్చాను.'

'చెప్పండి' అంది నెమ్మదిగ.

'ఆ రోజు.. సుందరం చనిపోయే ముందు మా ఇంటికి వచ్చాడు. అప్పుడు చాలా మామూలుగా చాల ఆరోగ్యంగా వున్నాడు.'

కళ్ళు పెద్దవిచేసి చూస్తూ కూర్చొన్న సుజాత—

# స్వయంకృతం

'నేను వచ్చిన తర్వాతే వచ్చారా?'

'అవును. మీరు అయిదుగంటలకు వెళ్ళిపోయారు అయిదున్నరకు నాకు కాఫీ త్రాగే అలవాటుంది గదా నేను లేచి డైనింగ్ రూంలోకి వెళ్ళబోతుండగ సుందరం కారు ఆగింది పది నిమిషాలు కూర్చున్నాడు.'

'ఆయన మీ ఇంటికి తరుచు వచ్చేవారా?'

'తరుచూ కాదుగాని అప్పుడప్పుడు వచ్చేవాడు'

'మా శారా? ఇలానే వచ్చిపోవడమనే విషయంమీరుగాని, ఆయనగాని నాకు చెప్పనే లేదు కదూ?'

రేణుక భయపడుతూ అన్నది.

'చెప్పవద్దని అతడే కోరాడు. ఎందుకలా అన్నాడో తెలియదు మీరు తరుచూ మా ఇంటికి వచ్చేవారుకదా. ఏదో ఒక రోజు మీ రిద్దరూ ఎదురుపడక పోతారాని నేను అనుకొన్నాను కాని అలా జరుగలేదు'

'ఆ రోజు మీతో ఏమైనా కష్టంగా మాట్లాడారా?'

'లేదు చాల హుషారుగ వున్నాడు. కాఫీ అడిగాడు. ఇచ్చాను'

'ఫ్లాస్కులో కాఫీనే యిచ్చారా?' నిర్భంగ అడిగింది.

'అవును. నేనింకా త్రాగలేదుకదా? మళ్ళీ పెట్టుకోవచ్చని అతడికి ఆ కాఫీనే యిచ్చాను తర్వాత వెళ్ళిపోయాడు.'

'ఒక్కమాటడుగుతాను. నిజం చెప్పండి. మిమ్మల్ని వారు ప్రేమించా రవునా?'

'సుజాతా...'

'ప్రేమ కథలు తమాషాగా వుంటాయి రేణుకగారూ, ఒక్కొక్కసారి ప్రాణాలూ తీస్తాయి. వెళ్ళిరండి. మీ వారు మీకోసం ఎదురు చూస్తుంటారు వెళ్ళండి నీసం మీ వారినైనా బ్రతకనీయండి క్షేమంగా, వెళ్ళండి ప్లీజ్...'

రేణుక నిశ్చేష్ఠురాలైంది. ఎలాగో లేచినిలబడి ఆగది విడిచి వెళ్ళిపోయింది.

* * *

సుజాత కళ్ళు తెరిచేటప్పటికి ప్రొద్దు వాలింది. తనప్రక్కనే శంకరం కూర్చొని చదువుకొంటున్నాడు.

'ఇది త్రాగమ్మా' పళ్ళరసం అందించాడు.

చేతితో నెట్టివేసింది.

కళ్ళు బరువుగా మూతలు పడుతున్నయి మగతగవుంది జ్ఞాపకాలతో గతం మళ్ళీ కళ్ళముందు కదలాడింది.

భర్త తననంత నిరాదరణ చేయడానికి కారణం తెలియడానికి ఎంతోకాలం పట్టలేదు. ఆఫీసులో బయల్దేరిన భర్త సరాసరి ఇంటికి రాకపోవటం, ఒక్కొక్కరాత్రి చాలి ఆలస్యంగా ఇంటికి రావటం ..తను కారణం అడిగితే తేలిగ్గా త్రోసిపుచ్చటం ...ఇవన్నీ తనను చికాకుపరిచి మనశ్శాంతి లేకుండా చేసినయి. ఏమీ చేతగానిదానిలా తను కూర్చోటం తనకే బొత్తిగా నచ్చలేదు.

అందుకే నిజాన్ని తెలిసికోవాలని భర్తను చాటుగ వెంబడించింది. అతడు వెళ్తున్న డాబాఇల్లు చూసింది. ఆ ఇంటి వివరాలు తేలిగ్గానే కనుక్కోగలిగింది ఆ రాత్రే భర్త యింట్లోలేని సమయంలో అతడి డైరీ అంతా చదివింది.

రేణుక, సుందరం గాఢంగా ప్రేమించుకొన్నారు కలలు కన్నారు. ఊహాలలో విహరించారు. గాలిలో మేడలు కట్టారు. కాని లక్షాధికారియైన రేణుక తండ్రి ఈ అనామకుడైన సుందరాన్ని అల్లుడిగ స్వీకరించలేక పోయాడు. తండ్రి కోసం తన ప్రేమను త్యాగం చేస్తున్నానని చెప్పి వెళ్ళిపోయింది రేణుక ఆఖరి సారి. ఆనాటినుండి సుందరంలో డబ్బు



మీద; డబ్బుగల వారిమీద కసి పెరుకొంది. అయినా ఆ డబ్బులోనే జీవించాలని తెలివిగ వలపన్ని సుజాతను చేపట్టాడు.

అమూల్యమైన సుజాత ప్రేమను అందుకోవాలని ఎంతో ప్రయత్నించే వాడు. కాని రేణుక జ్ఞాపకాలు అతడిని బంధించి వేసేవి.

ఏమీ చేయలేక చేతగాక సతమతమయ్యేవాడు.

సుజాత అంటే ఆదరం లేదు. ప్రేమా లేదు.

అన్నీ తెలిసికొన్న సుజాత ఒక నిర్ణయానికి వచ్చింది.

ఒక పార్టీలో పనిగట్టుకొని రేణుకను పరిచయం చేసికొంది. ఆమెమీద ఎనలేని జుగుప్స పెంచుకొంది. అయినా పైకి స్నేహం నటించి వాళ్ల ఇంటికి రాకపోకలు సాగించింది.

ఆ రోజు...ఆ రోజు...సుందరం చని పోయినరోజు ..నాలుగు గంటలకు ఒక స్థిర నిశ్చయానికి వచ్చి రేణుక ఇంటికి వెళ్లింది.

రేణుక సాదరంగ ఆహ్వానించింది.

ఫ్లాస్కులో వున్న కాఫీ ఇచ్చింది.

కాఫీ సిప్‌చేస్తూ 'మీరూ తీసికొండి' అంది సుజాత.

'నేను మాటి మాటికి త్రాగను. మూడు గంటలకు, మళ్లీ ఐదున్నరకు ఒక కప్పు త్రాగుతాను.' అంది రేణుక.

'రెండవసారి శ్రీ వారితో కలిసి త్రాగు తారన్నమాట' నవ్వింది సుజాత.

'అవుననుకోండి. కాని ఈరోజు వారులేరు. క్యాంప్ వెళ్లారు. రెండురోజుల వరకూ రారు'

'మరి కాఫీ......'

'నేనదే వేళకు త్రాగులాను.' నవ్వింది రేణుక.

కాఫీ పూర్తిచేసిన సుజాత.

'ఆ రోజు మీరా మ్యారేజి ఫోటోలు చూపుతానన్నారు.' అంది.

'ఓ మర్చిపోయాను. కూర్చోండి తెస్తాను.'

మేడపైకి వెళ్లింది రేణుక. ఈ అవకాశంకోసమే చూస్తున్న సుజాత చుట్టూ చూసింది. ఎవరూ లేరు. వెంటనే వానిటీ బాగ్‌లోనుండి చిన్న పొట్లం తీసి కాఫీ వున్న ఫ్లాస్కులో వేసి మళ్లీ ఆ కాగితం బాగ్‌లో పెట్టేసింది.

ఆల్బమ్‌తో వచ్చిన రేణుక హుషారుగ కబుర్లు చెపుతూ ఫోటోలు చూపుతోంది.

'మరొక గంటలో నీ హుషారు చల్లబడుతుందిలే' కసిగ అనుకొంది మనస్సులో సుజాత.

చేతివంక చూసుకొంది.

'అయిదయ్యింది. వెళ్తా' నంటూ లేచింది.

ఇప్పుడు సుజాత మనస్సు గాలిలో తేలిపోతోంది.

ఆనందంతో పరవళ్లుతొక్కుతోంది.

ఏ జ్ఞాపకాలతో తన భర్త తనను నిరాదరణ చేస్తున్నాడో అవి సమూలంగ నాశనమవుతాయి. ఇక అతడు తననే దేవతగ ఆరాధిస్తాడు ... భార్యగ ప్రేమిస్తాడు ... ఓహ్ ... ఆనందంతో తుళ్లిపడుతూ ఇంట్లో అడుగుపెట్టింది.

ఆ తర్వాత కొద్దిసేపటికే ఎంబాసిడర్ హారన్‌మోత విని బయటకు వచ్చింది. ●

డాక్టర్ కబుర్లు

# ఆస్ప్రిన్

పొరపాటున చిన్నబిడ్డ ఆస్ప్రిన్ బిళ్లలు మింగితే అది ప్రమాదకరమో కాదో ఎలా తెలుస్తుంది?

అమెరికాలో 'పాయిజన్ కంట్రోల్ సెంటర్' అనే సంస్థ ఉంది. వారి పరిశోధనలవల్ల తేలింది–

ఒక బిడ్డ బరువు 50 పవున్లు అయితే ఆ బిడ్డ 50 గ్రెయిన్ల ఆస్ప్రిన్‌దాకా తిన్నప్పటికీ విషం కాకపోవచ్చు.

సాధారణంగా పెద్దలు మింగే ఆస్ప్రిన్ మాత్రలో 5 గ్రెయిన్‌ల ఆస్ప్రిన్ ఉంటుంది.

అంటే 50 పవున్ల బిడ్డ 10 మాత్రలదాకా తినవచ్చునన్న మాట!

80 పవున్ల బిడ్డ 16 మాత్రల దాకా తినవచ్చు.

ఇవన్నీ సగటు లెక్కలనిబట్టి చెప్పే విషయాలు; ఎందుకయినా సరే డాక్టరుకి చూపించటం మంచిది.

జబ్బు చేసిన పిల్లల విషయంలో ఒక పవునుకి ఒక గ్రెయిను అనే సిద్ధాంతాన్ని మార్చవలసి వస్తుంది.

అసలు చిన్న పిల్లలు ఎన్ని మాత్రలు మింగాలో ఎలా తెలుసుకోనటం?! ఇందుకోసమయినా డాక్టరుని సంప్రదించటం మంచిది..




మందు బిళ్లలన్ని చిన్న పిల్లలకి అందకుండా దాచటం మంచిది!

హెచ్. ఎల్. హెర్మన్‌సోన్

(కాపీరయిటు)

# వారఫలం

## 23-5-1969 శుక్రవారం మొదలు 29-5-1969 గురువారం వరకు

**మేషం:** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. ఉద్యోగంలో యితరుల నిమిత్తం శ్రమ పొందవలసి వస్తుంది. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు. దైవకార్యాలు నెరవేరుతాయి.

స్త్రీలకు.— ఆరోగ్యం బాగా ఉంటుంది. సాటివారితో వాదప్రతివాదాలు తగవు.

**వృషభం:** మీరు యెంతగానో ఆశించిన వ్యవహారాల్లో ఫలితం సామాన్యంగా ఉంటుంది. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. విద్యావైజ్ఞానికరంగాల్లో మీ కృషి రాణించ గలదు. బంధుమిత్రులను కల్సుకొంటారు.

స్త్రీలకు — పుణ్యకార్యాలు చేస్తారు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మిథునం:** వ్యాపారంలో సాటివారి పోటీని యెదుర్కొని అనుకూలతను సాధించ గలరు. ప్రయాణాలు అనుకూలంగా ఉంటాయి. స్థిరాస్థి వ్యవహారాల్లో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. మిత్రులకు సహాయం చేస్తారు.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉంటుంది సంతోషకరమైన వార్తలను వింటారు.

**కర్కాటకం:** వృత్తిలో ప్రయోజనంగల సంభాషణలను జరుప గలరు. నూతన వ్యవహారాలు లాభించ గలవు. సాహసముతో కూడిన వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. రాజకీయ వ్యవహారాల్లో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. బంధు మిత్రులను కల్సుకొంటారు.

**సింహం** వృత్తి వ్యాపారాల్లో అనుకూలమైన మార్పులు వస్తాయి. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. సమయానికి యేదో ఒకవిధంగా డబ్బు చేతికి వస్తుంది. విద్యావైజ్ఞానిక రంగాల్లో మీ కృషి ప్రోత్సాహకరంగా ఉంటుంది ప్రయాణాలోచనలు చేస్తారు.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉంటుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**కన్య :** వారం ప్రారంభంలోనే వృత్తి వ్యాపారాల్లో చికాకులు యేర్పడి తరువాత సర్దుకొంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వ్యాపారంలో ఆదాయం బాగా ఉంటుంది. సాటివారిలో గౌరవం లభిస్తుంది. అధిక వ్యయం జరుగుతుంది.

స్త్రీలకు — కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**తుల** వ్యాపారంలో మీ ఆలోచనలకు తగిన అవకాశాలు లభిస్తాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. వారం మధ్యలో అన్ని వ్యవహారాల్లోను చికాకులు యేర్పడతాయి. మీ తాలూకు వస్తువులు పోయే ప్రమాదం ఉంది. దైవకార్యాలు నెరవేరుతాయి.

స్త్రీలకు — ఆరోగ్యం బాగా ఉండదు. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

**వృశ్చికం.** వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. స్థిరాస్థి వ్యవహారాలు బాగా ఉంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు బాగా ఉంటాయి ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు. మిత్రుల సహాయం లభిస్తుంది. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది.

స్త్రీలకు.— దైవకార్యాలు నెరవేరుతాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**ధనుస్సు** ఇదివరకు మీకు ఆందోళన కలిగించిన వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. అధికారుల వలన జరగ వలసిన వ్యవహారాలు సులువుగా జెరవేరుతాయి. సాంఘిక కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి.

స్త్రీలకు — ఆరోగ్యం బాగా ఉంటుంది. బంధువుల వ్యవహారాల్లో మీ కృషి ఫలిస్తుంది.

**మకరం** కొన్ని వ్యవహారాల్లో మీరు శ్రమపడినా, ప్రయోజనం ఉండదు. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వారం మధ్యలో అనుకూల పరిస్థితి యేర్పడుతుంది. వ్యాపారంలో ఆదాయం బాగా ఉంటుంది. విద్యావైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

స్త్రీలకు.—కుటుంబ వ్యవహారాల్లో చికాకులు కలుగుతాయి. సంతోషకరమైన వార్తలను వింటారు.

**కుంభం:** భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. సాటివారిలో గౌరవం లభిస్తుంది. వారం మధ్యలో అన్ని వ్యవహారాల్లోను చికాకులు యేర్పడతాయి. ఉద్యోగంలో యెవరినీ విశేషంగా నమ్మడం తగదు.

స్త్రీలకు — ఆరోగ్యం బాగా ఉండదు వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మీనం :** ఇతరుల మీద ఆధారపడే యే వ్యవహారమూ ప్రారంభించడం తగదు. రాజకీయ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. అధిక వ్యయం జరుగుతుంది. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి.

స్త్రీలకు.— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. సాటివారితో మాటపట్టింపులు తగవు.

—మహేష్

# పాశ్చరైజు చేసిన పాలు మంచివేనా?

పెద్ద నగరాల్లో పాశ్చరైజు చేసిన పాలు సీలువేసిన సీసాలలో సరఫరా చేస్తున్నారు. పాశ్చరైజు చెయ్యడం అంటే ఏమిటి? అలా ఎందుకు చెయ్యాలి? పాశ్చరైజు చెయ్యడంవల్ల పాల నాణ్యత ఏమైనా తగ్గుతుందా?

ప్రకృతిలో లభించే సహజసిద్ధమైన ఆహారాలన్నిటిలో పాలు ఉత్తమమైనవి—మనకే గాదు. సూక్ష్మజీవులకి కూడా! అందువల్లనే సాధారణ ఉష్ణోగ్రతలవద్ద పాలలో సూక్ష్మజీవులు బాగా వృద్ధిపొందుతాయి. వ్యాధుల్ని కలిగించే జీవులు పాలలో ప్రవేశించడానికి అనేక అవకాశాలున్నాయి—పితికే వ్యక్తి నుంచిగాని, పొదుగులు, పాత్రలు పరిశుభ్రంగా లేకపోవడంవల్లగాని, లేక వ్యాధిగ్రస్తమైన పశువులవల్లగాని, పశువుల్నించి సరాసరి పాలద్వారా వ్యాపించే జబ్బుల్లో ముఖ్యమైంది క్షయ. పాశ్చరైజు చేయడంవల్ల యిలాంటి సూక్ష్మజీవుల్ని నిర్మూలించవచ్చు.

ఈ పద్ధతిని మొదట్లో లూయీ పాశ్చర్ సారా నిల్వచేయడానికి వాడాడు. అందుకే దానికాపేరు వచ్చింది. యిందులో రెండు రకాలున్నాయి. ఒక పద్ధతిప్రకారం పాలని 142–145 F వరకు వేడి చేసి, ఆ ఉష్ణోగ్రతవద్ద అధమం అరగంట సేపుంచి, వెంటనే 50 F లోపుకి త్వరగా చల్లారబెడతారు రెండో పద్ధతిలో పాలని 160 F వద్ద 15–17 సెకండ్లు మాత్రం వుంచి, వెంటనే చల్లారబెడతారు యింకా ఎక్కువ ఉష్ణోగ్రతవాకా వేడిచేస్తే చెడిపోకుండా కొన్ని రోజులపాటుంచచ్చని ఈ మధ్య కనిపెట్టారు.

అయితే పాశ్చరైజుచేసిన పాలు మంచివి కాదని కొన్ని అపోహలున్నాయి. ఒకటేమిటంటే పాలని మరగబెట్టడంవల్ల వాటికుండే సహజమైన రుచి, వాసన, ఆహారవిలువ పాడైపోతాయని. నిజానికి ముందు తెలియకపోతే ఏవి పాశ్చరైజు చేసిన పాలో, ఏవి చెయ్యనివో చెప్పలేం. కనక రెండింటికీ రుచి, వాసనలో ఏమాత్రం తేడా వుండదు యిక పోతే ఆహారవిలువ మాట. యిందులోకూడా చెప్పుకోతగ్గ మార్పేమీ రాదు. పాలలో వుండే 'సి' విటమిను పాడయిపోయేమాట నిజమే. అసలు పాలలో ఈ విటమిను చాలినంతగా వుండదు. ఎలాగా యిది మనకి యితర ఆహారపదార్థాల్లోంచి రావలసిందే అలాంటప్పుడు ఆ వున్నది కాస్త పాడవడంవల్ల కలిగే పెద్దనష్టం ఏముంది?

యింకో అభ్యంతరం ఏమిటంటే పాశ్చరైజు చెయ్యడంవల్ల పాలు తోడుకునేందుకు, పులిసేందుకు సాయపడే బాక్టీరియా నశించిపోతాయని. యిందులోకూడా ఏమాత్రం నిజంలేదని శాస్త్రజ్ఞులు నిరూపించారు. పాలు తేలిగ్గా జీర్ణమయే శక్తి తగ్గిపోతుందనే వాదంకూడా సరైంది కాదు.

కనక మొత్తంమీద పాలు పాశ్చరైజు చేయడంవల్ల ఉపయోగాలేగాని చెప్పుకోతగ్గ దుష్ఫలితాలేవీ కలగవు. అయితే మన తాత ముత్తాతలు మామూలు పాలు తాగలేదా? వాళ్లు 90 ఏళ్లు బ్రతకలేదా అనవచ్చు ఆ రోజుల్లో ఆయుర్దాయం, అదృష్టం వున్న వాళ్లు బ్రతికేవారు. నిజమే. కాని అంటువ్యాధులు ఎక్కువగా వుండేవికాదా? వాటిని నివారించే ఉపాయం తెలిసినప్పుడు దాన్ని ఆచరించడంలో తప్పేం వుంది?

—డా॥ ఆర్. ఎల్. ఎన్. శాస్త్రి












# వెలుగు నీడలు



యలమంచిలి ఝాన్సీలక్ష్మి

సీరియల్

### జరిగిన కథ

రాజశేఖరం పెద్ద వ్యాపారస్థుడు. సహృదయుడూ స్నేహశీలి అయిన అతని ఒక్కగానొక్క కుమార్తె అనుపమ. అనుపమ కాలేజి పాటల పోటీలో మొదటి బహుమతి గెల్చుకుంటుంది. అక్కడే ఆమె మధుమూర్తిని చూస్తుంది. మధుమూర్తి తమ ఆప్తమిత్రుడని కుమార్తెకు పరిచయం చేస్తాడు రాజశేఖరం. మధు, వారింట్లో వుంటూ— అనుపమ అనురాగాన్ని రాజశేఖరం అభిమానాన్ని చూరగొంటాడు... రాధామాధవీయమ్ నృత్య నాటికలో అనుపమ రాధగా వేస్తుంది. మధు తప్పనిసరిగా మాధవుడు కావలసివస్తుంది. అనుపమ మనసునంతా ఆ మాధవుడే ఆవరించుకున్నాడు. ఫారిన్నుంచి అనుపమ బావ విజయకుమార్ వస్తాడు. అతను ప్రవేశించినందు వల్ల అనుపమా మధుమూర్తుల ప్రణయానికి ఏమీ ఆటంకం కల్గలేదు. మాధవి, మధుమూర్తులని చూసిన అనుపమ అపార్థం చేసుకుని కోపంతో వెళ్ళిపోయింది. తన కథనంతా వివరిస్తూ మధుమూర్తి ఉత్తరం రాస్తాడు అనుపమకి.

## 5

ఏ పనిచేస్తున్నా మనస్సు మధుమూర్తిని మరిచిపోలేక పోతోంది. అతని జీవితం విషాదపూరితం అయినందుకు పానుభూతితో కదిలిపోతోంది. అతడిని మరిచి పోవాలన్న భావనే మానవత్వాన్ని కోల్పోయినట్లు అనిపిస్తోంది. తనలో స్వార్థం కొండంతగా పెరిగిపోతున్నట్లు హృదయాన ఏదో పేరుకుంటోంది నానాటికీ.

నిర్మలంగా నవ్వుతూ తనవైపు చూసే మధుమూర్తిని మరిచిపోవడం సాధ్యమవడంలేదామెకు.

విచిత్రమైన ఆ ప్రణయ వేదనాగాధ పెద్ద ప్రవాహంలా గుండెల్ని ఛేదించుకుని బయటికి వస్తోంది.

'అతని నేత్రద్వయాన భ్రమా — భ్రాంతీ మచ్చుకైనా లేవు. మనస్సును సూటిగా స్పర్శించుతాయా చూపులు. మధురమైన ఆ కంఠస్వరాన కోమలత్వమే ఎక్కువగా ధ్వనిస్తుంది గంభీరతకన్నా.' ఎంతగా మరోపనిలో నిమగ్నమైనా ఆఅనురాగ పూర్ణ హృదయాన ఓమూల అతని వూహలు సెలయేరులా త్రుళ్ళిపడుతూనే వున్నాయి.

మధుమూర్తి మాటలన్నీ స్వచ్ఛమైన మణుల్లా ప్రకాశించ సాగాయి. మరోసారి వుత్తరం తెరవబోతూండగా ఎవరో లోనికి వచ్చిన చప్పుడైంది. వంటమనిషికూడా పని పూర్తిచేసుకుని వెళ్ళిపోయింది. నౌకరు సినిమాకు వెళ్ళాడు.

ఎవరా! అని చూసింది అనుపమ.

'నేనే ! అనూ !' అంటూ విజయకుమార్ లోనికి వచ్చాడు.

అనుపమ అతని కెదురుగా ఒక్క క్షణం కూడా నిలబడలేక పోయింది.

ముక్కులు బ్రద్దలవుతున్నాయి మత్తుమందు తాలూకు వాసనతో. అతనిరాక ఏమాత్రమూ ఆనందాన్ని కలిగించలేదు సరిగదా ఓ విధమైన భయం కదలసాగిందామెలో.

'అత్తయ్య బావుందా?' అన్నది ఏమీ తోచక.

'ఆహా! దివ్యంగా వుంది. సరే! మావయ్య రాత్రికి ప్రొద్దుబోయిగాని రారట. అని ఫోను చేయమన్నారు నీకు. స్వయంగా చెబుదామని వచ్చాను.'

అతని మాటలు తడబడుతున్నాయి రాను రాను.

లేడిపిల్లలా భయంతో ముడుచుకుపోతోందామె విదేశ సంస్కృతిపై అపరిమితమైన మోజు అలవరచుకున్న ఆ యువకుని ముందు భారత స్త్రీలోని హృదయం

భయంతో వణికిపోతోంది.

తెచ్చిపెట్టుకున్న నవ్వుతో అన్నదామె— 'హార్లిక్సు కలిపి తీసుకురానా ?'

చీకట్లు అలముకుంటున్నాయి. లైటు వేయబోయింది అనుపమ.

'అలాగే వుండనీ అనూ! చీకటే అందంగా వుంటుంది. వెలుతుర్లో నీ సౌందర్యం మరీ మెరిసిపోతుంది. చూడలేను' అతనికంఠాన ధ్వనించిన భావం ఆమెను శిలావిగ్రహంలా స్తంభింప జేసింది.

లైటు వేసింది. అయినా అతడు లేచి నిలబడ్డాడు. ఆమె చివురుటాకులా కంపించి పోతోంది.

'త్రైటెందుకూ! మైడియర్! కమాన్! అలా సోఫాలో ఓకుసుకు తీద్దాం!' అంటూ మాదకత నిండిన స్వరంతో ఆమె చేతిని పట్టుకున్నా డాతడు.

ఎరుపెక్కిన ఆ కళ్ళను చూడగానే ఆమె స్థాణువై పోయింది. నోట మాటే రాకుండా పోయింది.

'రావోయ్! మై ప్రెటీగర్ల్! స్వర్గం చూపిస్తాను' అంటూ సోఫాలో కూర్చున్న ఆమెమీదకు వంగి గుండెలకు హత్తుకో బోయాడు.

'బావా!' చెంప చెళ్ళుమన్పించింది ఆవేశాన్ని అణుచుకోలేక.

'యూ! నాటీగర్ల్! చూడు నిన్నేం చేస్తానో ?' ఆ డాక్టరు ఆమె చేతుల్ని రాక్షసుడిలా గట్టిగా పట్టుకొని తన వైపుకు తీసుకోబోయాడు.

ఆగ్రహంతో పెనగలాడుతోందామె వలలో చిక్కిన చేపలా. మరోలైటు వెలిగింది హఠాత్తుగా.

అనుపమ ప్రాణం కుదుటపడింది.

డాక్టరు త్రుళ్ళిపడి తలెత్తాడు అనుపమను కౌగిలిలోంచి వదిలి.

ఎదురుగా యిరువుర్నీ చూస్తూ నిల బడి వున్నాడు మధుమూర్తి — అనుపమ పరుగునవెళ్ళి అతని గుండెలపై వాలి పోయింది ఏడుస్తూ.

'మాష్టరూ! ఒక్క నిమిషం ఆలస్యమైతే మీ అనుపమ జీవితం సర్వనాశనమై పోయేది' ఆమె దుఃఖం యింకా ఆరనేలేదు.

మధుమూర్తి నేత్రాలు అగ్నిగోళాలయ్యాయి.

ఆవేశం తరంగాలై దుముకుతోందతని కంఠాన. ఆగ్రహం పడగ విప్పిన పామై బుసలు కొడుతోంది.

ఆ డాక్టరు మధుమూర్తి ఆవేశం చూడగానే నిర్వీణ్ణుడై పోయాడు. సోఫా లోంచి లేవలేక పోయాడు.

మధుమూర్తి ఆ డాకరి షర్టుకాలర్ని పుచ్చుకున్నాడు వంగి.

'డాక్టర్ విజయకుమార్! జీవితం గనుక, అదీ నువ్వు చదువుకున్న పశువ్వి గనుక చెబుతున్నాను. లేకపోతే యీనాటితో నీ జీవితం ఆఖరై పోయేది. కానీ నీలా పశువులుగా లేరందరూ!

గుర్తుంచుకో జీవితాంతం!



స్త్రీని విలాసవస్తువుగా మలచుకున్న క్షణమే మనిషి జీవితంలో పతనానికి నాంది. ఆ వ్యసనమే జీవితాన్ని క్రమ క్రమంగా కాల్చి భస్మంచేస్తుంది.

ఆడదంటే ఆటబొమ్మ అని భావించబోకెపుడూ!

వెలుగుతూన్న దీపశిఖవంటిది స్త్రీ! జీవితాన వెన్నెల్ని పండించుకోడానికి తోడుగా వుంటుందిగానీ ఆమె జీవితాన అంధకారం నింపాలని తలచావో శలభంలా మాడిపోతవ్!

జాగ్రత్త! మరోసారి అనుపమను స్పృశించావో! నీగతి నీకే తెలియదు మాటలుగాదపుడు. చేతల్లో కన్పిస్తుంది

ఫో! ఒక్కక్షణంకూడా వుండకిక్కడ! ప్రాణాలు దక్కవు!' పులిలా గర్జించాడతడు డాక్టర్ని లేపి నిలబెట్టి

ఆ డాక్టరి నిషా దిగిపోయింది గుండెల్లో పరాభవం కొండలై పోతోంది. సూదుల్లా గుచ్చుకుంటూన్న మధుమూర్తి మాటల్ని నెమరు వేసుకుంటూంటే అతని శరీరం దహించుకు పోతోంది. మ్లానవదనంతో దొంగలా వడివడిగా వెళ్ళిపోయి కారు స్టార్టుచేసి బాణంలా దూసుకుపోయాడు

అనుపమ ముఖాన కన్నీరు చారికలు కట్టింది. ఆ కనులలో తాండవమాడుతూన్న భయం యింకా కరిగిపోనే లేదు పూర్తిగా.

పెద్ద ప్రమాదంనుంచి బయటపడ్డట్లు

# వెలుగునీడలు

నిట్టూర్చింది పెద్దగా. కృతజ్ఞత నిండిన సజల నేత్రాలతో మధుమూర్తిని దైవంలా చూస్తూండిపోయింది

'నాన్నగారు రావడం ఆలస్యవౌతుందని చెప్పమని అన్నపుడే ఆడాక్టరి కళ్ళు అదో విధంగా మెరిశాయి అందుకే ఆఫీసునుంచి నేరుగా యిటే వచ్చేశాను. మూర్ఖుడు! ఎంతగా దిగజారిపోయాడు!' అన్నాడతడు

అనుపమను ముఖం కడుక్కురమ్మని పంపించి సోఫాలో కూర్చున్నాడు

'మాష్టారెపుడు వచ్చారో వూరినుంచి?' అనుకుంటూ ముఖాన కుంకుమ దిద్దుకుని హాలులోనికి వచ్చింది

ఆమె మనస్సింకా తేరుకోనేలేదు మధుమూర్తితో మాట్లాడాలన్పించింది ఏకాంతంగా కూర్చోలేనన్పించింది

'అదిగో! కారు వచ్చినట్లుంది. నాన్నగారొచ్చారనుకుంటాను' అంటూండగానే రాజశేఖరంగారు లోనికి వచ్చారు

మధుమూర్తి లేచి నిలబడ్డాడు

జరిగిన సంగతి తండ్రికి చెప్పాలనుకుందామె మధుమూర్తి వుండగానే కానీ అతడు రాజశేఖరంగారు రాగానే సెలవు దీసికొని వెళ్ళిపోయాడు

నిర్ఘాంతపోయింది అనుపమ

అతడావిధంగా వెళ్ళిపోవడం ఏమాత్రమూ నచ్చలేదు. తండ్రితో 'విజయ్‌కుమార్'ని గురించి ఏమని చెబుతాడోనని కుతూహలంతో వుందామె

కానీ అతడంతకుముపు ఏమీ జరగనట్లే వెళ్ళిపోయాడు. అందుకామె మనస్సు చివుక్కుమంది.

తన ఆంతరంగిక ప్రేమకది పెద్ద అవమానమైనట్లన్పించింది.

అతని నిర్లక్ష్యం ఆమెలోని అనురాగాన్ని మేల్కొల్పినట్లయింది. తండ్రికి చెప్పుకోవాలన్న వుత్కంఠ నశించిపోయింది.

రాత్రి భోజనాలదగ్గరమాత్రం అన్నది.

'బావను మనయింటికి రావద్దని గట్టిగా చెప్పండి'

రాజశేఖరంగారు ఆశ్చర్యంతోతలెత్తారు. కానీ కుమార్తె ముఖాన పరుగులెత్తే భావాల్ని చూడ్డానికి వీలులేకపోయింది. తలవంచుకుని అన్నం కలుపుకొంటోంది.

కానీ ఆమె కంఠాన ధ్వనించిన అసహ్యతా, కఠినత్వం ఏదో జరగరానిది జరిగినట్లు వూహించగలిగారాయన

'మొరటుగా ప్రవర్తించాడా అమ్మా! నిన్నేమైనా అనలేదుగదా?' కుమార్తె సమాధానంకోసం నిరీక్షిస్తూండి పోయారాయన.

మరో స్త్రీకి కూడా మనస్సు విప్పి చెప్ప గూడని, చెప్పలేని ఆ సంగతిని తల్లిలా పెంచుకున్న తండ్రి పురుషుడవడం మూలాన అనుపమకు చెప్పడానికి మనస్కరించలేదు అందుకే తలవంచుకునే వుండిపోయిందంతసేపూ

ఒక వ్యక్తిని గురించి అంత ఖండితంగా ఏనాడూ విమర్శించని అనుపమ అలా అనగానే రాజశేఖరంగారు ఆలోచనలో పడ్డారు

మరోసారి ప్రశ్నించలేదాయన.

మరునాడు తీరిక చేసుకుని విజయ్ కుమార్‌ను కలుసుకోవడానికై వెళ్ళారాయన

అతడపుడు యింట్లో లేడు

చెల్లెలే అన్నది మాటల మధ్యలో

'విజయ్-అనుపమను యీ యింటి కోడలిగా చేసికుంటే బావుంటుందంటున్నాడు' అని.

క్షణమాత్రం మౌనంగా వుండిపోయారాయన

'విజయ్‌ని వాకోసారి కన్పించమను

ఇదుగో ఈ కుర్చీ, బాగు చేయించే దెప్పుడో??



# ప్రతివారము




ఎయిర్-ఇండియా

(బి.ఒ.ఎ.సి. & క్వాన్‌టాస్ పారిచేరికతో)

(AI 8317 TE…

# వెలుగు నీడలు

రేపు' అన్నారాయన వెంటనే లేచి వెళ్ళి పోతూ గుమ్మంలో నిలబడి.

* *

ఆనాడే అనుపమ పుట్టినరోజు. రాజశేఖరంగారు ఆమె స్నేహితులందర్నీ ఆహ్వానించమని చెప్పారు. తల వూపిందామె. కానీ మనస్సున వుత్సాహం రవ్వంతకూడా లేకుండా పోయింది. ఆమె హృదయాన అనురాగాన్ని పండించి జీవితాన ఓ కొత్త అందం నింపిన మధురమైన వ్యక్తి ఆరోజున రేడక్కడ. ఆఫీసు పనిమీద హైదరాబాదు వెళ్ళాడు.

మరో నాలుగురోజులకుగాని తిరిగిరాడు.

విందుకు అతిథులందరూ హాజరై కూర్చున్నారు. కానీ అనుపమ ఎప్పటిలా హుషారుగా, నవ్వుతూ, నవ్విస్తూ సెలయేరులా తుళ్ళిపడడం లేదు.

తెల్లని చీరలో అతిసామాన్యంగా ఆకర్షణ ఏమాత్రమూ లేని విధంగా అలంకరించుకుంది. అసలు అలంకరణ వున్నట్లే కన్పించడం లేదెవరికీ.

కుమార్తె ముఖాన పొరాడుతూన్న ఉదాసీనతను చూడగానే విభ్రాంతులయ్యారాయన.

కాని జీవన ప్రాంగణంలో సంధ్యాకాంతులు పడుతూన్న ఆయన హృదయానికి కుమార్తె అంతర్యానవున్న రహస్యం అర్థమవ్వనే లేదు ఆమె మనస్సు నొచ్చుకుంటున్నట్లు గ్రహించి అన్నారాయన.

'ఏమ్మా? ఒంట్లో కులాసాగా లేదా?' అని.

'అవును నాన్నగారూ! కొంచెం తలనొప్పిగా వుంది. కాస్త త్వరగా ముగించండి పార్టీని' అన్నదామె పూర్తిగా అబద్ధాన్ని చెప్పలేక.

ఆశీస్సులూ, అభినందనలూ, శుభాకాంక్షలూ, బహుమతులూ అందుకున్నదామె తెచ్చిపెట్టుకున్న ఆనందంతో.

అంతమందితో మాట్లాడుతున్నా, అభినందలు స్వీకరించుతున్నా కళ్ళురెండూ హాలువైపు చూస్తూనే వున్నాయి మనస్సున నిలచిన వ్యక్తికోసం

ఆరోజున రాడని తెలిసినా అంతర్యాన కేదో నమ్మకం వస్తాడని లోన. పని ముగించుకుని రావచ్చునేమో' అని ఆమె లోలోన ఆశ పడసాగింది. అయినా అతనికి గుర్తుందా నా పుట్టినరోజీనాడేనని' నిరాశతో నిట్టూర్చిందామె.

ఎవరికీకాని వాడిలా, నిర్లిప్తంగా వుండే ఆ యువకుని అంతర్యాన దాగివున్న దెంత రహస్యమో, అసలు ఏమీ లేనే లేదో ఎవ్వరికీ అంతుబట్టదు.

ఎంతటి బాధనయినా గుండెల్లోనే యిముడ్చుకుని నవ్వుతూ కన్పించుతాడు. నవ్వులు నింపుతాడు ఎదుటివారి హృదయాల్లో.

నిర్మలంగా నవ్వుతూన్న ఆ కళ్ళను చూడగానే అన్పిస్తుందెవరికైనా.

'ఒక్క నిమిషం యితనితో గడిపితే చాలు—నా మనసున ఆవేదనంతా విన్పించి తృప్తిగా ఒక్కసారైనా నిట్టూర్చవచ్చు' అని

'మృదు మధురంగా నినదించే అతని స్వరాన' హాయి హాయి కలలు గంటూన్నట్లుంటుంది' అనుకుంటుంది అనుపమ మనస్సు.

విందు ముగిసి ఆహ్వానితులందరూ నిష్క్రమించినా 'విజయ్' కదలనేలేదు. అనుపమ తన గదిలోకి వెళ్తూండగా అన్నాడు.

'సారీ! అనూ! ఆ రోజున నా నెత్తిన ఏదో దెయ్యం కూర్చుంది. మరోసారి అంత మూర్ఖుడిగా జన్మలో కన్పించను'.

విచిత్రంగా చూసిందామె అతనివంక కన్నార్పకుండా.

'అపరాధం క్షమాపణ చెప్పుకోడంతోనే అంతరించిపోదు డాక్టరుగారూ! మా భారతదేశంలో పశ్చాత్తాపం అంతరంగాన లేనిదే అపరాధం ఎలా మాసిపోతుంది?' అంటూనే ఆమె తన గదిలోకి వెళ్ళిపోయింది మరో మాటకు నిరీక్షించకుండానే.

ఆ డాక్టరిముఖం తెల్లగా పాలిపోయింది.

ఇంగ్లీషులో ఏదో సన్నగా గొణుక్కుంటూ వెళ్ళిపోయాడు.

రాజశేఖరంగారు ఆహ్వానితులందర్నీ సాగనంపి వచ్చేసరికి ఎనిమిది గంటలైంది.

తండ్రి కూతుళ్ళిద్దరూ విందును గురించే మాట్లాడుతు కూర్చుండిపోయారు కొంత సేపటివరకు. అనుపమ ముఖాన వెలుగుతూన్న ఆనందరేఖల్ని చూసి ఆ తండ్రి హృదయం తేలికపడింది.

నాలుగవరోజున మధుమూర్తికోసం నిరీక్షిస్తున్న అనుపమకు నిరాశ, విసుగూ కలగసాగాయి. పొద్దు వాలిపోతోంది. అప్పటికీ మధుమూర్తి వచ్చిన జాడే లేదు.

'ఒకవేళ ఆఫీసుకువచ్చి రూముకు వెళ్ళిపోయారేమో? అనుపమను చూడాలని ఆయన మనస్సుకు లేనిదే నాకెందుకీ ఆతురత?! మహా నియమనిష్ఠలుగల మహామునీంద్రులాయె? అపర ప్రవరాఖ్యులాయె ఆయన!' ఆమె మనస్సు కసిగా విమర్శించింది.

దీపాలు వెలిగాయి. అనుపమ రేడియో ట్యూన్‌చేసి కూర్చుంది. నౌకరు ఆఫీసు

సెలవు గిలవు లేదూ.. పర్మిషన్ లేదు..! వంటె గంటకూ ఆఫీసుకు రావటం...?

ఇవి గోండి సార్..! మీకు బ్రహ్మాండమైన క్యాలెండర్లు పట్టుకొచ్చాను!

వ. తులసీరాం

నుంచి వార్త తెచ్చాడు—

'నాన్నగారు ఎక్కడో మీటింగుకు వెళ్తున్నారట! మిమ్మల్ని కూడా తీసుకు రమ్మన్నారు' అంటూ.

అప్పుడప్పుడు అతి ముఖ్యమైన విందులకు, సాహితీ సమావేశాలకు కుమార్తెను కూడా వెంటతీసుకొని వెళ్ళడం రాజశేఖరం గారికి అలవాటే. అందుకే అనుపమ చీర మార్చుకుని తయారై కారులో కూర్చుంటూ అడిగింది.

'మధుమూర్తిగారు వచ్చారా వూరి నుంచి?' అని.

'వచ్చారమ్మగోరూ!' అన్నాడు నౌకరు.

ఆమె ముఖం ఎండుటాకులా మాడిపోయింది. నిలువెల్లా నిరుత్సాహం ప్రాకిపోయిందామాట వినగానే.

ఆఫీసుముందే తండ్రి ఎదురై కారులో కూర్చున్నారు.

'మన ఏలూరు సాహితీ సమితివాళ్ళు ఎవరో రచయితను సన్మానించుతున్నారటమ్మా! మనకూ కూడా ఆహ్వానం పంపించారు. సరదాపడతావుగదా నువ్వు కూడా సాహిత్యమంటే! అందుకే రమ్మన్నాను' అన్నారాయన.

ఆయన మాటలకు జవాబు చెప్పాలన్న మాటే మరిచిపోయిందామె. హృదయాన తన అనురాగాన్ని నిర్లక్ష్యంచేసిన ఓ వ్యక్తిని గురించి ఆలోచనలు అలలై లేచి పడుతున్నాయి.

విరాళాలు యివ్వడంలో వుదారుడని పేరుగన్న రాజశేఖరంగారు రాగానే వచ్చి ఆహ్వానించారు గౌరవంగా సమితి సభ్యులు.

వేదికపై నాలుగు కుర్చీలు, బల్లలు అమర్చి వున్నాయి. హాలులోవున్న కుర్చీలన్నీ దాదాపు నిండిపోయాయి ఆ ఆహ్వానితులతో. ముందు వరుసలోవున్న కుర్చీలు చూపించారు తండ్రీ కూతుళ్లకు.

అంతలోనే మైక్‌లోనుంచి అధ్యక్షుని కంఠం విన్పించింది.

జీవితంలో దాగివున్న అందాల్ని, లోతుల్ని మనోహరంగా చిత్రించగల వాళ్ళనే కవులనీ, రచయితలనీ, చిత్రకారులనీ పిలుస్తుకుంటాం. ఆ కళాజీవుల హృదయాల్లో పొంగి పొరలుతూన్న మధువు నాస్వాదించడంతో వున్నంత మహదానందం వర్ణించలేను నేను రెండుమాటల్లో.

కానీ వారి ప్రతిభను గుర్తించి సన్మానించాలన్న వూహే కరువైంది యీ రోజుల్లో. ఎక్కడో ఒక్కచోట యిలాంటి సమితులుతప్ప ప్రతిచోటా ఏవీ అలాంటి పనులకు వునుకోవు.

అందుకే సమితివారిని అభినందించుతున్నాను మనస్ఫూర్తిగా. ఇపుడు 'మల్లెలూ — మనస్సులూ' అన్న నవలా రచయిత 'మాధవ్'గారు వేదికపైకి రావాలని కోరుతున్నాం.'

అనగానే అతి నిరాడంబరంగా వున్న ఓ వ్యక్తి ముందున్న సీట్లలోనుంచి వచ్చి వేదికనెక్కి సభకు నమస్కరించాడు.

రాజశేఖరంగారూ! అనుపమా ఆశ్చ

# రచయితలకు మనవి

### కథలు, వ్యాసాలు

ప్రచురణకి స్వీకరించబడని తమ వ్రాత ప్రతులని తిప్పిపంపగోరే రచయితలు వ్రాత ప్రతులతోబాటే తగుమాత్రం తపాలాబిళ్లలు అతికించిన స్వంత చిరునామాకల కవరు కూడా పంపాలి. స్టాంపులు మాత్రం పంప రాదు. స్టాంపులు మాత్రం పంపించినట్లయితే వ్రాతప్రతులు తిప్పిపంపబడవు. వ్రాత ప్రతులతో గాక విడిగా స్వంత చిరునామా, తగుమాత్రం పోస్టేజికల కవర్లు పంపినా వ్రాతప్రతులు తిప్పిపంపబడవు.

ప్రచురణకి స్వీకరించబడని వ్రాతప్రతుల విషయంలో ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపబడవు.

### నవలలు

ప్రచురణకి స్వీకరించబడని నవలల వ్రాత ప్రతులు మేమే తిప్పి పంపిస్తాము. వ్రాత ప్రతులతో స్వంత చిరునామాకల, తగు మాత్రం పోస్టేజి అతికించిన కవర్లు పంప నవసరం లేదు. 100 అరఠావు పేజీల పైన ఉన్న వ్రాతప్రతులే నవలలకింద పరిగణింప బడుతాయి.

### కార్టూన్‌లు

ప్రచురణకి స్వీకరించబడని కార్టూన్‌లు తిప్పి పంపగోరేవారు కార్టూన్లతో స్వంత చిరునామాకల, తగుమాత్రం పోస్టేజి అతికించిన కవర్లు జతపరచి పంపాలి. స్టాంపులు మాత్రం పంపరాదు.

**షరా:** వ్రాతప్రతులనీ, కార్టూన్లనీ వీలయినంత భద్రంగా తిప్పిపంపే ప్రయత్నాలు చేస్తాము కాని, వాటి విషయములో ఎటువంటి బాధ్యతనీ స్వీకరించలేము. ఈ షరతుని గమనించి రచయితలు తమ రచనలు, కార్టూన్‌లు పంపగలరు.

*సంపాదకుడు*
*ఆంధ్రసచిత్రవారపత్రిక*

# వెలుగునీడలు

ర్యంతో కదలలేక పోయారు.

అందరి ఎదుటా నవ్వుమొహంతో నిల్చున్న ఆ రచయిత ఎవరోకాదు—

'మధుమూర్తే!'

అందుకే తండ్రీ కూతుళ్లిద్దరూ నోట మాటైనా రానంతగా ఆశ్చర్యపడ సాగారు.

తిరిగి అధ్యక్షుడు చెప్పసాగాడు—

'ఈ నవలకు మా సమితివారు ప్రథమ బహుమతి యిచ్చారనగానే. కుతూహలాన్ని అణచుకోలేక వయస్సు పైబడినా ఓపిగ్గా చదివాను. విజ్ఞానాన్ని పండించుకున్న సాహితీవేత్తలు దృష్టిలో అత్యుత్తమ కళాఖండం అన్పించుకున్న యీ నవల నిజంగా నా మనస్సునెంతో అలరించింది.

నవలలోని మొదటి వాక్యమే రచయిత ప్రతిభకు మచ్చుతునకలా గోచరిస్తోంది—

ఇంకా నా మనస్సున బొంగరంలా తిరుగుతూనే వుందా వాక్యం—

'ప్రేమించగల హృదయమే కొండంత అపరాధాన్నికూడా క్షమించి భరించ గల్గుతుంది' అంటూ ప్రారంభవౌతుంది కథ. ఎంతటి అర్థాన్నో స్ఫురింప జేస్తూన్న ఆ వాక్యంలాగానే నవల అంతటా చక్కని ప్రతిభ వెలుగులొలికించుతోంది.

సహజ సంఘటనలు! సంఘటనలకు తగిన భాష! భాషకు తగిన శైలి! మనసు వూయలలా వూగి ఏ లోకాల్లోనో విహరిస్తుంది కథ చదివినంతసేపూ.

అశ్లీలమైన, అసభ్యమైన పదం ఒక్కటికూడా లేదందులో.

అందుకు నాకెంతో ఆనందంగా వుంది.

జీవితాన్ని తరిచి, కష్టసుఖాల్ని భరించి మానవుడిగా నిలబడగల ధైర్యం, ఆత్మ విశ్వాసం మనలో వున్ననాడే అమరుల మౌతాం' అంటూ ముగుస్తుంది రచన.

ఇంత చక్కని నవల నందించిన 'మాధవ్'గారిని మనఃపూర్వకంగా అభినందించుతూ మరో రచనతో తిరిగి సన్మానాన్ని పొందాలని ఆశిస్తున్నాను.'

అధ్యక్షుని వుపన్యాసం పూర్తికాగానే సమితివారు మధుమూర్తిని ఘనంగా సన్మానించారు. వేయినూట పదహార్లు చదివించారు బహుమతిగా—

పూలమాలల్ని తీసి చేతిలో వుంచుకుని సభనోసారి కలయజూశాడతడు—

'సన్మానానికి ఎంతవరకు అర్హుడినోగానీ నా మనస్సుమాత్రం కృతజ్ఞతతో నిండిపోయి ఏమీ చెప్పలేకుండా వుందిప్పుడు.

కానీ రెండు ముక్కలుమాత్రం చెప్పకుండా వుండలేను.

'కలంతో సృష్టింపబడిన విప్లవంలో శాంతీ, అహింసా అంతర్వాహినులై ప్రవహించాలి. అప్పుడే సాహిత్యం మనసుల్ని పరవశం జేస్తుంది. ఆ విప్లవమే చైతన్యానికీ, ప్రగతిపథానికీ దీపంలా దారి జూపుతుంది.

ఆనందావేశంలోనో, దుఃఖంలోనో మనస్సు కరిగి, మధురాతి మధురంగా, మనస్సుల్ని ద్రవింపజేస్తూ, మనోహర రాగమై, జీవన వాహినియై, విజ్ఞానంపు వీణియయై పాడుకుంటుంది. అదే కవిత్వం. అవిధంగా హృదయం స్పందించినపుడు వ్రాసిందే వుత్తమ కళాఖండం.

మనస్సున విరిసిన మల్లియవంటి స్పందనకే పరిమళం వుంటుంది. అలాంటి రచనలే మన తెనుగున రావాలని నా కోరిక' అంటూ సన్మానానికి కృతజ్ఞతాభివందనాల నర్పించి వేదికపైనున్న కుర్చీలో కూర్చున్నాడతడు.

తరువాత మరో ముగ్గురు 'నవల'ను గురించి ప్రశంసించుతూ మాట్లాడారు. మధుమూర్తి రచనల్లో మొదటినుంచీ సహజతా, సౌందర్యం వెల్లివిరిసి, చక్కని శైలి ప్రవహిస్తుంది గాబట్టే వాటికంత విలువ వుంటోంది' అంటూ శ్లాఘించారు.

సభ ముగియగానే రాజశేఖరంగారి దగ్గరకు వచ్చాడు మధుమూర్తి.

అనుపమ తండ్రి వెనుక కనిపించీ కనిపించనట్లు నిలబడింది.

'ఇంత మహారచయితవని చెప్పనేలేదేమిటోయ్ మధూ? మా అనుపమ అభిమాన రచయిత 'మాధవ్'వి నువ్వేనన్నమాట! ఆ! గుడ్! హార్టీ కంగ్రాచ్యులేషన్స్!' అంటూ అభినందించారాయన సంతోషం నిండిన స్వరంతో.

'థాంక్స్ అండీ!' అన్నాడతడు.

అనుపమ అంతవరకూ పెదవి కదపనే లేదు. కనులెత్తి చూడనే లేదు. కానీ ఆమె మనస్సంతా అతని మూర్తే నిండివుందని

అతనికి తెలియదు.

'సరే! అనూని కాస్త యింటి దగ్గర డ్రాప్ చెయ్యి! నాకు ఆఫీసులో పనుంది కొంచెం' అంటూ రాజశేఖరంగారు మరో కారులో వెళ్ళిపోయారు.

అనుపమ మౌనంగా వెళ్ళి కారులో కూర్చుంది.

మధుమూర్తి చిన్నగా నవ్వుతూ అన్నాడు.

'మరీ యింత కోపం వస్తుందనుకోలేదు అనూ! హైద్రాబాద్‌నుంచి సరాసరి నీ దగ్గరకే రావాలనుకున్నాను. కానీ తీరా వచ్చిన తర్వాత యీ సన్మానం మూలాన నిమిషమైనా తీరిక లేకుండా పోయింది.'

అప్పటికీ ఆమె మౌనం వదిలిపెట్టనే లేదు.

ఇంటిదగ్గర దిగి లోనికి వెళ్ళిన తర్వాత చేతిలోవున్న ఓ పుస్తకమూ, చిన్న పెట్టె ఆమె చేతిలో వుంచుతూ అన్నాడు—

'నీ పుట్టినరోజున యిక్కడ వుండాలని ప్రయత్నించినా రాలేకపోయాను. ఉద్యోగ బంధం ఎలా వదుల్తుంది చెప్పు? మరి వస్తాను నేను! నావంక చూడటమే యిష్టం లేనట్లుంది. మరీ దూరంగా జరిగిపోకు అనూ! ఓ స్నేహమయిగానైనా నా జీవిత స్మృతుల్లో నిలిచిపో!' అని వెళ్ళిపోయాడతడు వెంటనే.

పాకెట్ వంక చూసింది. పుస్తకాన్ని తిరగవేయ సాగింది.

మొదటి పేజీలో ముత్యాల వరుసల్లా రెండు పంక్తులున్నాయి.

'జీవితాన వున్నవి రెండే రెండు
తీయని అనుబంధాలు!
అవే స్నేహమూ, అనురాగమూ!
నీ కవి అందాలని ఆశిస్తూ—
స్నేహితుడు–మధుమూర్తి'

ఆమె హృదయం పూవులా విచ్చుకుందా వాక్యాలు చదవగానే.

'స్నేహితుడు–మధుమూర్తి! వుహూ! అనుపమ జీవితాన అనురాగమే మీరు! ఆనందమే మీరు! మాస్టారూ!' మధురోహలతో మనస్సు పరవశించింది.

కమ్ముకువచ్చిన క్రోధ మేఘాలు ఆ భావనతో తేలిపోయాయి. పెట్టె తెరవగానే హృదయం మల్లెల పానుపే అయింది.

తెల్లని విగ్రహం! మాధవునిది! జగన్మోహనాకారుడైన మురళీధరుడు—మందహాసంతో, లోకాన వెలుగంతా కనులలో నింపుకుని మెరిసిపోతున్నాడు!

'మాష్టారూ! యింత మధురమైనదా?! మీ హృదయం!! నా కింత చోటు దొరకదా అంతటి మందిరాన?! మనస్సున మల్లెలు కురిపించలేరా? లేదు! దూరంగా జరిగిపోలేను! నాకంత శక్తి లేదు! నా మనస్సంత రాయి గాదు!' పురి విప్పిన మయూరమైందామె హృదయం.

(ఇంకా వుంది)



రెండేళ్ళు కూడా నిండని థామస్ హంబర్గ్‌లో ఒక తోటలో ఆడుకుంటూ నీటి గుంటలో పడిపోయాడు, దీనిని చూసి పిల్లి తెగ అరిచి పెద్దలని అక్కడికి వచ్చేట్లు చేసింది! పిల్లవాడి ప్రాణాలు దక్కాయి. (యు. పి. ఎస్. డాడ్)




'వెంకటలక్ష్మిని వెంటనే పిలు—' లోపలనించి పరుగునవచ్చిన వర్సమ్మ ఆత్రంగా అంది!

గుమ్మందగ్గర బొంగరాల ఆట ఆడుకుంటున్న రాము — ఆటమాని ఓ క్షణం అర్థంకానట్టు నాయనమ్మవైపుచూచాడు.

'ఏమిట్రా—ఆ వెర్రిచూపూ నువ్వూనూ —అవతల నొప్పులు ప్రారంభమైతేనూ—' కొంచెం కోపంగా కసురుకుంది నాయనమ్మ.

అప్పటికిగానీ రాముకి అసలు పరిస్థితి అవగాహన కాలేదు. తనతో ఆడుకోడానికి మరో చిన్నవాడు రాబోతున్నాడన్నమాట !— సన్నగా నవ్వుకుని బొంగరాన్ని అరుగు మీదకు విసిరి పక్కవీధిలోకి పరిగెట్టాడు మంత్రసాని వెంకటలక్ష్మిని పిలుచుకొచ్చేందుకు.

* * *

'లంచ్ బ్రేక్'లో మలబార్ కాఫీ హోటల్లో గుమిగూడిన గుమాస్తాల బృందం దగ్గరకు వచ్చాడు వెంకటేశం — తన స్థూలకాయాన్ని ఈడ్చుకుంటూ.

'ఇప్పటికి తెమిలిందేమిటోయ్ ? — మాకు అప్పుడే అయిపోయింది కార్యక్రమం—' నవ్వుతూ అన్నాడు జనార్దనం వెంకటేశాన్ని పలుకరిస్తూ.

సన్నగా—పొడుగ్గా—చామనచాయగా వుండి—హెయిరోడ్ క్రాప్‌తో కొంచెం నాజూగ్గానే వుంటాడు జనార్దనం. బొత్తిగా యువకుడు కాకపోయినా చూచేవాళ్లకు ఆ 'ఇంప్రెషన్' కలిగిస్తాడు.

ఎదుటి కుర్చీలో కూర్చుంటూ అన్నాడు వెంకటేశం—

'మీరందరూ కాఫీలు త్రాగడం పూర్తి చేశారని తెలుసుకోడానికి రాలేదు. మనందరికీ దగ్గర్లోనే కాఫీ పారాయణం వుందని చెప్పడానికి వచ్చాను—'

ఈ మాటలు అందరిలోనూ గొప్ప కుతూహలాన్ని చెలరేపాయి.

'ఏమిటేమిటి ?—ఏం కథ ?— ఎవరికయినా ప్రమోషన్ వచ్చిందా ?—' అన్నారు నలుగురు గుమాస్తాలు ముక్తకంఠంతో.

'ఆఁ!—వచ్చింది. మన జనార్దనానికి. ఉద్యోగంలో కాదు. పిల్లల సంఖ్యలో. ఇంటి దగ్గర్నుంచి టెలిఫోన్ వచ్చింది. మనవాడు నాలుగో మజిలీ వేశాడట. ఆ వార్త రిసీవ్ చేసుకుని వస్తున్నాను—' అన్నాడు వెంకటేశం జనార్దనంవేపు నవ్వుతూ చూస్తూ.

ఆతృతగా వెంకటేశంవేపు చూశాడు జనార్దనం.

'మళ్లీ అబ్బాయేనటలే. కాఫీ మాట దేముడెరుగు కానీ — ముందు పర్మిషన్ పుచ్చుకుని ఇంటికి చెక్కెయ్—' సిగరెట్ పొగ వదులుతూ మిత్రుడికి సలహా చెప్పాడు వెంకటేశం.

'అహాఁ! అంత త్వరగా విడిచిపెట్టేది లేదు. మన పక్షులందరికీ కనీసం కాఫీ అయినా కొట్టించాల్సిందే-' న్యాయం చెప్పాడు 'ఏ' సెక్షను క్లర్కు గోవిందరావు.

'ఉండవోయ్—మగపిల్లవాడు కదా అని మనవాడు కాస్త డిసప్పాయింట్ అయి వుంటేనూ—' సర్ది చెప్పాడు మరో గుమాస్తా నరసింహం.

జనార్దనానికి ఈ మాటలేవీ వినబడటం లేదు. పెద్ద బరువు అతని గుండెలమీద నించి దింపేసినట్లయింది. తేలిగ్గా నిట్టూర్చాడు.

పర్మిషన్ కాగితం పడేసి—బస్‌స్టాప్‌కు చేరుకున్నాడు జనార్దనం. సిగరెట్ ముట్టించి బస్‌స్టాప్ దగ్గరున్న స్థంభానికి ఆనుకుని బజారును నిశితంగా ఓ సారి చూశాడు. వీధంతా మందకొడిగా, బద్ధ

కంగా వున్నట్టనిపించింది. కొన్ని 'డ్రైన మిక్'గా వుంటే బాగుండుననిపించిం దతడికి.

విసుగ్గా టైమ్ చూసుకున్నాడు. రెండున్నర— పది నిముషాలయింది, తను ఇక్కడికొచ్చి. ఇంకా బస్సు రావటంలేదు. ఎందుకింత ఆలస్యం ? — ఆఫీసుకు ఆల స్యంగా వస్తే గుమాస్తాలను చివాట్లు పెట్టడం తెలుసుగానీ—బస్సులూ, రైళ్ళూ ఆలస్యంగా వస్తే ఏం చెయ్యాలో తెలియదు ప్రభుత్వానికి. దేశంలో బద్ధకం, మంద కొండితనం, బాగా పెరిగిపోయినాయి.

టాక్సీలో వెళ్ళిపోతే?—మహా అయితే మూడు రూపాయలవుతుంది. జేబులో వున్న ఒకే ఒక అయిదురూపాయలనోటు వెకిలిగా నవ్వింది. టాక్సీకి మూడురూపాయలిచ్చేస్తే —మరి ముందు మాట ? — ఖర్చులు ఇంకేమీ లేవా?—సినిమాలో అద్దంముందు నిలబడి హితవు చెప్పే పెద్దమనిషిలాగా అనుభవంగారు సలహా చెప్పారు.

'హు'అని బాధగా మూలిగాడు జనార్ధన రావు ఎప్పటిలాగానే.

నిజానికి—ఈ అనుభవం జనార్దన రావుకు మొదటిదేమీ కాదు. నాలుగోది.

నాలుగుసార్లూ అతగాడు ఇలా ఇంటికి వెళ్ళడానికి తహతహలాడాడు. ప్రతిసారీ భార్యకు సుఖ ప్రసవం అవుతుందో లేదో అని ఆదుర్దా పడేవాడు. అలా అని జనార్ద నానికి షాజహాను మార్కు బుద్ధులేవీలేవు. అతగాడికి తాజ్ మహల్ కట్టించగల ఉద్దేశము, స్తోమత రెండూలేవు.

సిగరెట్‌ను క్రిందపడేసి బూటుకాలితో రాస్తూ—అప్రయత్నంగా ఎదుట కనబడ్డ సైన్‌బోర్డును చూశాడు. కుటుంబ నియంత్రణ వాళ్ళగోల ... సన్నగా నవ్వు కున్నాడు జనార్దనం. ఆ సైన్‌బోర్డు అపశకున పక్షిలాగా కనిపించింది. ఈకుటుంబ నియంత్రణొకటి—ఎక్కడ బడితే అక్కడ మంచీ మర్యాదా లేకుండా ఇలా తన ఆనందానికి అడ్డు రావచ్చునా అని—విసుక్కు న్నాడు జనార్దనం. ఆ బోర్డువేపు చూడ కూడదనుకున్నాడు. కాని — (బొమ్మలో) గంపెడు సంసారాన్ని ఏడుస్తూ మోస్తున్న ఆ పెద్దమనిషి తనని చూచి జాలిగా నవ్వి నట్టనిపించింది. 'ఏం బ్రదర్ బాగున్నావా' అని పలకరించినట్లనిపించింది. 'పోవోయ్ నా గొడవ నీకెందుకూ—' అనుకుంటూ దూరంగా జరిగిపోయాడు జనార్దనం.

ఎదురుగా రోడ్డుమీద సగం చిరిగిన మాలా సిన్హా వాల్‌పోస్టర్ కనబడింది.

'మాలా' కళ్ళల్లో 'ఛార్మ్' వుంది. మనిషిలో 'గ్రేస్' వుంది. అందువల్లే ఆవిడ తన ఫేవరేట్ స్టార్.

నిజానికి—సరోజిని—అదే తన స్వీట్ హార్ట్—కూడా బావుంటుంది. పెళ్ళిచూపుల నాడే అనుకున్నాడు తను ఆ పిల్ల తాలూకు చూపులు చూచి—జూనియర్ మాలాసిన్హా అని. అయితే — సరూ ఇంకా బాగా నవ్వుతుంది. హాయిగా, తియ్యగా, మధుబాల లాగా నవ్వుతుంది. తప్పజారి కేరాఫ్ జనార్దన రావ్ అయిపోయింది కానీ—లేకుంటే రీటా ఫరియాలాగ 'మిస్ యూనివర్స్' అయి పోయేది. కాని—ఆ అమ్మాయిలో ఒక చెడ్డ డిఫెక్ట్ వుంది. ఎప్పుడూ మొగపిల్లల తండ్రిని చేస్తుంది తనని—ఆ అందమైన కళ్ళనీ, ముక్కునీ, ఇంకెవ్వరికి ఇవ్వ కూడదని కాబోలు పంతం. తెలుసురా బాబూ ఆడవాళ్ళ మెంటాలిటీలు.

బస్సులో కూర్చున్న తర్వాత కూడా జనార్దనానికి ఆలోచనలు వదల్లేదు.

చిన్నప్పుడు నాయనమ్మ అనేది తనని అబద్ధాల వెధవా అని—అంతేకాదు—అంతా ఆడపిల్లలే పుడతార్రా నీకు అని బెదిరించేది-ప్చ్!—కాని నాయనమ్మమాటలు ఫలించలేదు. ఇది ఇలా వుండా అని— ఆఫీసరుదగ్గర పనిగట్టుకుని ఎన్నో అబద్ధాలు చెప్పాడు—అబ్బే — ఏమీ గుణం కనిపించందే—మన పిచ్చిగానీ, మంత్రాలకి చింతకాయలు రాల్తాయిటండీ!—పోయిన వారంలో కామోసు భగవంతుడు సరోజిని కల్లో కనిపించి నీకు ఆడపిల్ల పుడుతుం దోయ్—అని చెప్పాడట — భగవంతుళ్ళు కూడా అబద్ధా లాడేస్తున్నారీ రోజుల్లో.

పోనీలే—ఎవరయితేనేం—తల్లీ పిల్లాడూ కులాసాగా వుంటె అదే చాలు— అనుకున్నాడు చివరకి. జీవితంతో రాజీపడటం జనార్ద నానికి ఉగ్గుపాలతో అబ్బినవిద్య—

అతగాడి ఆలోచనలు ఇలా వుండగానే అశోకనగరం బస్‌స్టాప్ రానేవచ్చింది.

* * *

ఆ రోజు అయిపోయింది. భళ్ళున ప్రక్కరోజున తెల్లవారింది మామూలు గానే. సరే—సాయంత్రం కూడా అయింది

మళ్ళీ బస్‌స్టాండు—జనార్దనమూ— అతగాడి తాలూకు ఆలోచనలూను.

బాబుకి తండ్రిపేరు పెట్టాలా, మామ గారిపేరు పెట్టాలా,—బాబు బారసాలకి ఎవరెవరిని పిలవాలి?— ఇలాంటివేవీ సమస్యలు కావిప్పుడు జనార్దనానికి. వాటి గురించి ఆలోచించాలన్న కోరిక—ఉత్సాహమూ—ఆలోచించగల సామర్థ్యమూ అతని కిప్పుడు లేవు. అతగాడికి ఇప్పుడున్న ఆలోచన ఒక్కటే. డబ్బు...డబ్బు...డబ్బు...అది తప్ప మరేదీ కనబడటంలేదు జనార్ధ నానికి.

మంత్రసాని ఫీజు—తెవాల డబ్బు

రెండు పాలడబ్బాలు—కావాలి డబ్బు

తన భార్యకు (అంటే పిల్లల తల్లికి) బలం మందులు—తీసుకురా డబ్బు.

ఛ-వెధవ డబ్బు—ఎందుకు పుట్టిందిది ప్రపంచంలో? — జుట్టు పీక్కున్నాడు జనార్దనరావు. అసలు 'డబ్బు' అనే పదార్థం లేకుండా — దీని అవసరం లేకుండా మనుషులెప్పుడూ బ్రతకలేదా ప్రపంచంలో? — బోల్షివిక్ విప్లవం తర్వాత రష్యాలో డబ్బు అనేది ఎసి పారేశారట కొన్నాళ్ళు — మంచి పని చేశారు. మనంకూడా అలాచేస్తే బాగుణ్ణు —గొణుక్కున్నాడు జనార్ధనం.

జనార్ధనానికి ఇప్పుడు 'నెంబర్ ఫోర్' గాడి బుజ్జిబుగ్గలుగానీ — వెన్నెల్లాంటి నవ్వుగానీ జ్ఞాపకం రావటం లేదు. ఆఫీసు ఎగ్గొట్టి నిన్న ఇంటికి వెళ్ళి ఆ బుజ్జి వెధవ అందాన్ని చూచి ముగ్ధుడైపోయాడు. ఒరేయ్—బుజ్జీ — వెధవది — అందాన్ని వర్ణించడానికి అమ్మాయిల చెక్కిళ్ళు పట్టుకుని దేముళ్ళాడతారెందుకురా వెర్రి కవిగాళ్ళూ —నీ గులాబీ బుగ్గలకన్నా బాగుంటాయంటరా ఆముదెచ్చిల చెక్కిళ్ళూ? —సెక్సులోపడి ప్రపంచం తగలబడి పోతూం దిరా—అని గొణుక్కున్నాడు ఆ రోజున. ఇహాథ—తనథా ఫిలాసఫీ ఏమీ జ్ఞాపకం రావటం లేదు.

బాలెంతరాలు — అదే సరూ — తన డార్లింగ్ —కళ్ళల్లోని చిలిపిదనం చురుకు దనం, జ్ఞాపకం రావటం లేదు. ఆఫీసునించి వరిగెట్టుకొచ్చిన తనని చూచి చిన్నగా నవ్వి—కళ్ళు వాలుస్తూ—'మళ్ళీ ఓడి

# నాలుగో వాడు

పోయాం—' అన్నప్పుడు ఆమె ముఖంలో అందంగా నాట్యమాడిన భావాలు—

'లేదు సరూ! — ఇందులో ఓడటం, గెలవటం, ఏముంది?—ఎవరయితే మాత్రమేం?—' అని తను అన్నప్పుడు సరూ—అదేలెండి సరోజిని — పెదవుల మీదినించి సున్నితంగా జారిన నవ్వు — అందులోని 'గ్రేస్' అనే పదార్థం—తనకి జ్ఞాపకం రావటంలేదు. జ్ఞాపకం చేసుకోడు కూడా.

అలాంటివన్నీ జ్ఞాపకం చేసుకోడానికి తనేమన్నా కుర్రకారా ఏమిటి—బాధ్యతగల తండ్రిని—అందులోనూ నలుగురు పిల్లలకి — జనార్దనం తాలూకు అంతరాత్మ గొణుక్కుంది.

ఆఫీసులో అందరి జేబులూ తడిమి చూశాడు—డబ్బుకోసం. 'సారీ బ్రదర్' అన్నారంతా—నెలాఖరు—వాళ్ళు మాత్రం ఏం చేస్తారూ? — సరోజినికి మాత్రం ఆపాటి బుద్ధి వుండక్కర్లేదూ — కనేటప్పుడు ఆ మాత్రం తారీఖు గుర్తుంచుకోనక్కర్లేదా అని — గొణుక్కున్నాడు జనార్దనం. జోక్ బాగుంది. ఎప్పుడో తీరుబడిగా సరూ దగ్గిర వేద్దాం—అనుకున్నాడు. సర్లే — ఇప్పుడా గొడవ ఎందుకు?—

జేబులోంచి సిగరెట్ తీసి వెలిగించాడు. బస్స్టాండు దగ్గిరున్న స్తంభానికి ఆనుకుని సిగరెట్ పొగ వదులుతున్నాడు శూన్యంలోకి. ఏం చెయ్యాలిప్పుడు? — డబ్బు ఎక్కడ పుడుతుంది తనకి? — డబ్బు లేకుండా యింటికి వెడితే బాబుకి ఆహార మెలాగ?— కందిరీగల్లాగా ఈ ప్రశ్నలు జనార్దనం చెవిలో 'గుయ్' మంటున్నాయి.

ఎదురుగా సైన్‌బోర్డ్.

పరిమిత కుటుంబం—సుఖ సంతోషపు మార్గం—ఇద్దరు పిల్లల్ని తల్లిదండ్రులు ఆనందంగా ఆడిస్తున్న బొమ్మ. పిల్లలు బోసినోటితో నవ్వుతున్నారు. వాళ్ళనుచూచి అమ్మా, నాన్నా, నిండుగా నవ్వుతున్నారు.

'నవ్వండోయ్—నవ్వండోయ్ — నవ్వే వాళ్ళందరూ విరగబడి నవ్వండి. ఈలోకంలో డబ్బున్న వాళ్ళదేనోయ్—నవ్వూ ఆనందమూను. డబ్బులేకపోతే ఇద్దరుకాదు ఒక్కడున్నా ఏడుపే—డబ్బుంటే వందమంది ఉన్నా ఆనందమే. వాడెవడూ — [illegible] రాబర్ట్స కెనడీకి పదకొండుమందో ఎంతమందో పిల్లలట. బ్రతికున్నాళ్ళా అతగాడు ఏడ్చాడా అని?—బొమ్మలేస్తే సరిపోలేదు. మనీ బ్రదర్. మనీ—అది పట్టుకురా—ఎంతసేపు నవ్వమంటే అంతసేపు నవ్వుతాను—' సిగరెట్ పడేసి పొగ వదులుతూ—మాబాగా అనుకున్నాను అనుకున్నాడు జనార్దనం.

ఇంతలో జనార్దనం దృష్టి బస్స్టాప్ దగ్గిర నిలబడ్డ ఇద్దరు స్టూడెంట్లమీద నిలచింది. మొదటి గొట్టాంపేంటు—రెండో శాల్తీతో అంటోంది.

'బర్త్‌కంట్రోలు అమలు పరచాలంటే ఇలా బోర్డులు పెట్టినంతమాత్రాన ఏమీ జరుగదు. ముగ్గురుపిల్లలు దాటిన వాళ్ళ విషయంలో ప్రభుత్వం కఠినచర్యలు తీసుకోవాలి—నాలుగోవాడికీ—ఆపై వాళ్ళకూ—ప్రభుత్వం సాధారణంగా యిస్తుండే స్కాలర్‌షిప్‌లు మొదలైనవి ఇవ్వకూడదు. రైల్వేఉద్యోగస్తుల విషయంలో నాలుగో వాడికీ—ఆపై వాళ్ళకూ ఫ్రీపాస్‌లు వర్తించకూడదు. ఇక ముగ్గురు పిల్లలు దాటిన వాళ్ళకు యాభైరూపాయల అదనపు ఇన్‌కమ్‌టాక్సుగానీ—అది లేనప్పుడు ఒక ఇంక్రిమెంట్ ఆపుచేయడంగాని చెయ్యాలి—' గొట్టాంపేంటు విజృంభిస్తోంది.

కసిగా పళ్ళు కొరుక్కున్నాడు జనార్దనం.

ఒరేయ్—బ్రహ్మచారులూ— మీకెందుకురా ఈ గొడవలూ—మళ్ళీ మాట్లాడారంటే నాలుక చీల్చేస్తాను. నాలుగోవాడంటే అంత చులకనట్రా —మీకు మా నాలుగోవాడు ప్రధానమంత్రి అవుతాడేమో ఎవరికి తెలుసు? అంత కాకపోయినా కనీసం ఏ పెద్ద ఆఫీసరయినా చాలు మీరు జుట్టు పట్టుకుని ఏడవడానికి. జీనియస్ అన్నవాడు ఎన్నోనెంబరులో వుంటాడో ఎవరికి తెలుసు?

సరే—ఒకవేళ పోనీ కాలేదనుకో—ఆ బాధపడేవాణ్ణి నేను నాకు ఓపిక ఉన్నంత వరకూ వాళ్ళను చదివిస్తాను. వాళ్ళకు యిష్టం వున్నంతవరకూ వాళ్ళు బాగుపడతారు. మధ్య మీ గొడవ ఏమిటోయ్.

జాతీయసమస్య—విశాలదృక్పథం—ఇలాంటి పెద్దమాటలను అడ్డంపెట్టుకుని ప్రతివాడికి ఈరోజుల్లో కుటుంబ నియంత్రణ

గురించి మాట్లాడటం ఫాషనై పోయింది. మొన్నమొటుకు మొన్న ఆ శర్మగాడొకడు— ఓ పాతిక సర్దరా అంటే—లేదనేది పోగా— ఇంకా ఏమిటిరా ఇది — ఆపరేషన్ చేయించుకో — నాలుగోవాడు కూడాను— అంటూ బోడిసలహా చెప్పాడు. నాలుగోవాడనే సరికి ప్రతివాడూ సలహా చెప్పేవాడే. ఛ ఛ లోకానికి బొత్తిగా మంచీ మర్యాదా పోతోంది.

ఆలోచనలలో వున్న జనార్ధనం మోటారు సైకిలు రొదలో ఈ లోకంలోకి పడ్డాడు. బస్‌స్టాండు దగ్గిర మోటారు సైకిలు ఆపుతూ వరహాలు జనార్ధనాన్ని పలకరించాడు.

'ఒరేయ్ — జనార్ధనం. బస్‌స్టాండు దగ్గిర మీన మేషాలు లెక్క పెడుతున్నావ్— లిఫ్టు కావాలా ఏమిటి?'

ఉలిక్కిపడిన జనార్ధనం అతగాడినిచూచి ముఖం ఇంత చేసుకుని ముఖం నిండా నవ్వు పులుముకుని 'ఈ లిఫ్టుతో సరిపోయేది కాదోయ్—నాకు కొంచెం పెద్దసైజు లిఫ్టే కావాలి' అన్నాడు భావ గర్భితంగా అతగాడి 'జావా' ఎక్కుతూ.

'అదంతా తాపీగా చెబుదువుగానిలే—కాఫీ త్రాగిన తర్వాత—ఏం, కథ, బాగున్నావా?' అన్నాడు అతగాడు మోటారు సైకిలు పోనిస్తూ.

జనార్ధనం అతగాడితో బాతాఖానీ వేస్తున్నాడు. జోకులు విసురుతున్నాడు. అతగాడి మాటల్లో గొప్ప విలువ ఉన్నట్టుగా ఒప్పేసుకుంటున్నాడు. కాని— అంతరాత్మ మాత్రం పరధ్యానంగా వుంది అతగాడు (అంతరాత్మారావు) తనలో తను గొణుక్కుంటున్నాడు.

ఈ వరహాలు తనకి చిన్నప్పుడు క్లాస్‌మేట్, పైగా మంచి మిత్రుడు కూడాను. స్కూల్లో ఒట్టి మొద్దబ్బాయిలా వుండేవాడు. ఎప్పుడూ మేస్టర్ల చేత తిట్లు తినేవాడు. ఫస్టుమార్కులు తెచ్చుకునే తనని చూచి 'ఒరేయ్ జనార్ధనం—నీకింత తెలివితేటలు ఎలా వచ్చాయిరా? — గొప్ప అదృష్టవంతుడివిరా నువ్వు!' అనేవాడు.

చివరకు అదృష్టవంతు డెవరో లోకం తీర్పు చెప్పనే చెప్పింది. వరహాలు సిల్కు లాల్చీలు వేసుకుని మోటారు సైకిలుమీద తిరుగుతూ వుంటే—తను మాసిపోయిన నూలుగుడ్డలు వేసుకుని వెరతిక్కిరానీ బస్సుకోసం ఎప్పుడూ రాని అదృష్టం కోసం పడిగాపులు పడు తున్నాడు. ప్చ్! ఇదీ బ్రదర్ లోకం—దెబ్బ—వరహాల గాడి మోటారు సైకిలు చాలా బాగా పోతోంది. మొన్న కొన్నలాటరీ టికట్టు పేలితే ఇలాంటిది కొనాలి.

మలబార్ హోటల్లో కాఫీ సిప్‌చేస్తూ అన్నాడు వరహాలు—

'ఊ!—ఇంతకూ అర్జంటుగా వందరూపాయలు కావాలంటావ్ ?—'

'ఊఁ—' తలాడించాడు జనార్దనం — ఆఫీసరు మాటలకు తల ఆడించినట్టు—

'నేనోటి చెబుతాను వింటావూ ?—' అన్నాడు వరహాలు. ఓ క్షణం ఆగి మళ్ళీ అతగాడే ప్రారంభించారు—'దేముడి దయ వల్ల నాకు డబ్బుకు కొదవలేదు. నువ్వడిగిన డబ్బు సర్దుతాను ప్రస్తుతానికి. ఆ గొడవ వదిలిపెట్టేయ్. నీ జీతం ఎంతో చెప్పు. మహాపుంటే రెండొందలు. నీ కిప్పుడు నలుగురు పిల్లలు. నిజానికి — నీ జీతానికి ఇద్దరు మహా అయితే ముగ్గురు మాగ్జిమమ్ లిమిట్. నువ్వా లిమిట్‌ను దాటి వచ్చేశావు. ఇప్పుడీ నాలుగోవాడికి నీకున్న తక్కువ ఆదాయంతో ఎంతవరకు చదువు చెప్పించగలవో—ఎంతవరకూ అభివృద్ధిలోకి తీసుకురాగలవో —ఓ సారి ఆలోచిస్తే అర్ధమవుతుంది. కోపం తెచ్చుకోకు బ్రదర్. మిత్రుడిగా చెబుతున్నాను. దేశం— జనాభా

# నాలుగో వాడు

సమస్య—ఇలాంటి వాటిగురించి మాట్లాడాలనే కోరికగానీ, మాట్లాడే అర్హతగానీ నాకు లేదు. ఇది కేవలం ఒక మనిషికి సంబంధించిన వ్యక్తిగత సమస్యగానే మాట్లాడుతున్నాను — ఇప్పటికయినా నా మాటవిని ఆపరేషన్ చేయించుకో—నీకున్న జీతంతో — పైనున్న బాధ్యతలతో ఈ వందరూపాయలూ నువ్వు మళ్ళీ నాకు తిరిగి ఇవ్వగలవని అనుకోవడంలేదు. పోనీ —ఇవ్వగలవనుకో—అదెంతకష్టమో నాకు తెలుసు. అందుచేత ఇది అప్పుగాకాక — సహాయంగా భావించి తీసుకో — మళ్ళీ ఎవరినీ ఇలా అడిగే అవసరం తెచ్చుకోకు—'

చెళ్ళున లెంపకాయ కొట్టినట్టయింది జనార్దనానికి. వందరూపాయలు ముఖం మీదకొట్టి 'గెటౌట్ రాస్కెల్' అన్నట్టనిపించింది. 'నీ బ్రతుకు పిల్లలోకటా' అనీ హేళన చేసినట్టనిపించింది. ఉద్రేకం కట్లు తెంచుకుని వచ్చింది. నా నాలుగోవాడు ఎందుకూ కొరగాడట — కనీసపు చదువునుకూడా వాడికి తను చెప్పించలేడట—ఏడిశాడు — వీడేదో మహా విద్యావేత్త అయినట్టు మాట్లాడు తున్నాడు—ఒరేయ్— చూస్తూండరా — నా నాలుగోవాణ్ణి ఈ వూరికి కలెక్టర్ని చేసేస్తాను. రాధాకృష్ణన్ లాంటి జీనియస్సును చేసేస్తాను. అప్పుడు నువ్వే చెంపలేసు కుంటావు. పొరబాటు ఒప్పుకుంటావు.

జనార్దనం తాలూకు ఆత్మాభిమానం తిరగబడింది. వాడు నిన్ను ఇన్సల్ట్ చేశాడు —వాడిడబ్బు తీసుకోవడ మేమిటి ?—నాకు అప్పిచ్చేవాళ్ళు లక్షమంది వున్నారంటూ వాడిడబ్బు వాడి మొహాన్న కొట్టేయ్. మహా దానకర్ణుడిలాగా ముష్టి పారేస్తున్నాడు— అంతరాత్మరావు జోరీగలాగా గొడవ పెట్టాడు.

కాని—జనార్దనం అంతరాత్మని బుజ్జగించాడు. కళ్ళెర్రజేసి కేకలేశాడు. వెధవ్వేషాలు వేయమాక అని కసురుకున్నాడు. ఎలా అయితేనేం—బలవంతంగా అంతరాత్మ నోటికి గ్వాలియర్ తాళం కప్పపడింది.

'వస్తాను బ్రదర్—విష్‌యూ గుడ్‌లక్—' అంటూ మోటారు సైకిల్ ఎక్కాడు వరహాలు — కాఫీ కార్యక్రమం అయిన తర్వాత.

'థాంక్స్—' నూతిలోంచి వచ్చినట్టుగా వచ్చిందీ జనార్దనం సమాధానం.

మోటారుసైకిలు కదిలిపోయింది.

సన్నగా చినుకులు పడుతున్నాయి. ఆకాశంమీద దట్టంగా మబ్బులు పులుముకున్నాయి. వర్షం వస్తుందేమో !—వస్తేనేం ?— సమయానికి బస్సు దొరక్కపోతే హాయిగా టేక్సీమీద వెళ్ళిపోవచ్చు—జేబులోవున్న వందరూపాయల నోటు గర్వంగా నవ్వినట్టనిపించింది. కాని—ఆ నవ్వులో జనార్దనం శృతి కలపలేక పోయాడు. అతడి మస్తిష్కంలో ఏవేవో ఆలోచనలు పరిగెడుతున్నాయి. బజార్లో బేబీ ఫుడ్ తీసుకుని ఇంటికి చేరేసరికి దాదాపుగా తొమ్మిదయింది.

'ఇంతసేపటివరకూ రాకపోతే ఎక్కడా వీలు చిక్కలేదేమో అనుకున్నాను—' అంది సరోజిని భర్త తెచ్చిన బేబీఫుడ్‌ని చూస్తూ సన్నగా నవ్వుతూ—

'బాబూ ! నాన్నొచ్చారు చూడరా—' అంది కొడుకుతోటి. వాడు పనిగట్టుకుని తండ్రివైపు తిరిగి ఆశ్చర్యంగా నోరు వెళ్ళబెట్టుకుని చూచాడు. మరుక్షణం లోనే బోసినోటితో నవ్వాడు.

జనార్దనం ఇవేమీ పట్టించుకోలేదు. ఈ గొడవంతో తనకు సంబంధించినది కాదన్నట్టుగా అక్కణ్ణించి కదిలిపోయాడు. భర్త ప్రవర్తనను అర్థం చేసుకోలేక పోయింది సరోజిని.

రాత్రి భోజనం అయిన తర్వాత పక్కమంచం వాల్చుకుని ఆరుబయట పడు కున్నాడు జనార్దనం. ఎన్నోప్రశ్నలు అతడి మనస్సులో సినిమారీళ్లలాగా తిరుగు తున్నాయి. డబ్బులేనివాడికి ఈ ప్రపంచంలో స్థానమే లేదా ?—ఆఖరికి తండ్రిగా కూడా మనిషి విలువను, స్థాయిని, అంచనా కట్టేది డబ్బేనా ?—డబ్బులేని వాడి పిల్లలు—వాళ్ళ బ్రతుకులూ—లోకానికి లోకువా ? — బోధగా కణతలు పట్టుకున్నాడు జనార్దనం.

చౌరస్తాలో టవర్‌క్లాక్ మూలుగుతోంది.

పదకొండయింది. ఇంకా నిద్ర రావటం లేదు. బహుశా — ఇంక రాదేమో !—

యాదాలాపంగా సిగరెట్ పెట్టెకోసం జేబులు తడుముకోబోయాడు. అప్పటికి గాని జ్ఞాపకం రాలేదు - జనార్దనానికి సిగరెట్లు అయిపోయాయని.

హడావిడిగా నాయుడు కిళ్లీకొట్టుకు బయలుదేరాడు. పదకొండు దాటుతున్నా నాయుడు ఇంకా కిళ్లీకొట్టు మూసే వుద్దేశంలో వున్నట్టులేదు. పైగా ఉషారుగా ఎవరితోనో కబుర్లు చెబుతున్నాడు.

యాదాలాపంగా వెళ్లి— 'చార్‌మినార్ పెట్టె—' అన్నాడు జనార్దనం.

ఇంతలో జనార్దనం భుజంమీద బలమైన చెయ్యిపడింది.

వెంకటేశం !—

'ఏమిటి — ప్రక్కనున్న మనుషులను కూడా గుర్తించలేనంతటి పరధ్యానంలో వున్నావ్—'

ఆ మాటకు సమాధానాన్ని కప్పదాటు వేసి—నవ్వుతూ అన్నాడు జనార్దనం—

'ఈ వేళప్పుడు ఇక్కడ కాలక్షేపమేమిటి ?—'

ఇంతలో సిగరెట్ పెట్టె అందిస్తూ అన్నాడు నాయుడు—

'కాయడం కాదండి. మామంచి విశేషాలు చెబుతున్నారు—'

మాట మధ్యలో అన్నాడు వెంకటేశం—

'అబ్బె— ఏంలేదూ— ఇవాళ పేపర్లో పడలేదూ హాస్పిటల్లో వదిలేసిన పాప ఉమ సంగతి—అది చెబుతున్నాను—'

అప్రయత్నంగా ఆ వార్త జ్ఞాపకం వచ్చింది జనార్దనానికి: ఎవళ్లో ఆగంతకులు ఒక అందమైన పాపను హాస్పిటల్ గుమ్మందగ్గర వదిలేశారు. ఆ పాపను చూచి—జాలిపడి ఒక కోటీశ్వరురాలు పెంచుకుంది. ఆ పాప—శ్రీమంతురాలై— ఇప్పుడు పెంపుడుతల్లితో సహా విదేశాలకు వెళ్లబోతోంది—

ఆ పాప ఎంత అదృష్టవంతురాలు ? —ఆ పాపేకాదు — పాపను కన్న తల్లిదండ్రులుకూడా అదృష్టవంతులే!— తమ బిడ్డ బాగుపడటంకన్నా వాళ్లకు ఇంకేం కావాలి ?

భారంగా నిట్టూర్చాడు జనార్దనం.

తన బాబుమాత్రం అదృష్టవంతుడు ఎందుకు కాకూడదు ? — వాడినిమాత్రం కోటీశ్వరుడో ఎందుకు పెంచుకో









కూడదు ?- విచిత్రమైన భావన తళుక్కుమని మెరిసింది జనార్దనం మస్తిష్కంలో.

'మన బుజ్జిగాడి కళ్లల్లో వెలుగు కనబడుతోందండీ !— మన మిగతా పిల్లలెవ్వరికీ వీడికున్నంత ముఖవర్చస్సు లేదు. వీణ్ణి చూస్తూంటే గొప్పవాడై పోతాడేమో అనిపిస్తోంది —' అన్న భార్య మాటలు జ్ఞాపకం వచ్చాయి.

'గ్రహబలం — రాశిబలం — అన్నీ బాగున్నాయి— నీ కొడుకు లక్షాధికారి అవుతాడోయ్ మనవడా !—' అన్న వీరయ్య సిద్ధాంతిమాటలు స్మృతిపథంలో మెదిలాయి.

నిజం. బుజ్జిగాడి కళ్లల్లో రాచకళవుంది. వీడిని మిగతా పిల్లల్లాగా దారిద్ర్యంలో పెంచకూడదు వాడిని కోటీశ్వరుణ్ణి చేయాలి. ప్లిమత్ కార్లలో తిప్పాలి. నాలుగోవాడన్నందుకు దారిద్ర్యంలో మగ్గుతాడనుకున్నాను గానీ — ఇలా — శ్రీమంతుడవుతాడు— అనుకోలేదోయ్ అనాలి వరహాలు సిగ్గుతో తలదించుకుంటూ. బుజ్జిగాడి ప్లిమత్ ముందు వరహాలు గాడి 'జావా' జావలా అయిపోవాలి. బుజ్జిగాడి టెర్ లిన్ సూట్ ముందు వరహాలు గాడి పిల్లకాల్చి చిన్నబోవాలి. కాని— ఇదంతా జరగడం ఎలా ? — బుజ్జిగాడి అదృష్టాన్ని వాడికి అప్పజెప్పటం ఎలా ?— బాధగా కణతలు పట్టుకున్నాడు జనార్దనం.

ఏమిటోయ్—ఆలోచన — ఇంత సేపట్నుంచి అరిగిపోయిన గ్రామఫోను రికార్డులా మొత్తుకుంటున్నా ఒక్కమాటయినా మాటాడవు ? —' విసుక్కుంటున్నాడు వెంకటేశం.

*   *   *

ప్రక్కరోజు 'లంచ్ అవర్'లో ఓ ప్రకటనకు డ్రాఫ్టు తయారుచేశాడు జనార్దనం.

'కావలెను'

గౌరవనీయమైన కుటుంబమునకు చెందిన, పదిరోజులు వయస్సుగల, అందమైన అబ్బాయిని పెంచుకొనుటకు ధనవంతులు, ఉన్నత కుటుంబీకులయిన వారు కావలెను, కులము, మతము, ఏదయినను ఫర్వాలేదు వివరములకు—జనార్దనం, ఇంటినెంబరు 10-3-33 - అశోకనగర్, ...వాడ—అన్న చిరునామాకు వ్రాయండి—'

అది చూచి తనలోతనే చిన్నగా నవ్వుకున్నాడు జనార్దనం.

అసలే జనాభా ఎక్కువైన ఈ దేశంలో నీ పిల్లల్ని పెంచుకునేదెవరు ?—వేళాకోళం చేశాడు 'ఆత్మ'రావు.

పోవోయ్. నీకేం తెలుసు ?— దేశంలో పిల్లలు ఎక్కువై ఏడ్చేవాళ్లు ఎంతమంది వున్నారో—పిల్లలు లేక 'పిల్లలో రామచంద్రా—' అని ఏడుస్తున్నవాళ్లూ అంతమందే వున్నారు ఎంతోమంది మిలియనీర్స్ పిల్లలకోసం అల్లాడిపోతున్నారు. వాళ్ళుగానీ బుజ్జిగాణ్ణి చూశారంటే ఎగరేసుకు తీసుకుపోతారు. వాడికున్న సిరికళ ఏ కోటీశ్వరుడికి వుందని ? —నేనే గనుక కోటీశ్వరుణ్నయి—నాకే గనుక పిల్లలు లేకపోతే—వెంటనే బుజ్జిగాణ్ని మా రామవరప్పాడు తీసుకెళ్లిపోయి పెంచేసుకునేవాణ్ణి. డోంట్ వర్రీ — బ్రేవో మై బోయ్ — ధైర్యం చెప్పాడు జనార్దనంలోని సీరియస్ జనార్దనరావు

ప్రకటన కాపీతీసి కవరులో పెట్టి— పత్రిక ఎడ్రసు వ్రాస్తున్నప్పుడు జనార్దనం చెయ్యి వణికింది తను ఏదోకాని పని చేస్తున్నట్టుగా గుండెల్లో ఘోష వినబడింది.

చేత్తో నుదురును బాధగా నులుముకున్నాడు.

ఒకవేళ నిజంగా పెద్ద కోటీశ్వరుడే వస్తే తను బుజ్జిగాణ్ణి ఇవ్వగలడా ?— ఇచ్చి బ్రతకగలడా ? — గుండెల్లో కెలికినట్టయింది. బుజ్జిగాణ్ణి కార్లో కోటీశ్వరుడు తీసుకు పోతూంటే—గుండెలు పగిలేటట్టు రోదిస్తున్న భార్య ఆర్తనాదం చెవులకు వినబడింది భీతి జనకంగా.

బుజ్జిగాడి ఏడుపు.

'నాన్నా—తమ్ముణ్ణి ఇచ్చెయ్యొద్దు—' అంటూ బ్రతిమాలుతున్న పెద్దపిల్లలు.

అచేతనంగా నిలబడివున్న తల్లి—

ఇవేమీ తనని కదిలించలేవా ?— బుజ్జిగాడు ఎక్కబోయే కాడిలాక్ కారు చాటున వీటన్నిటినీ తను దాచెయ్యగలడా ?—

లేదు లేదు బాధగా గుండెలు అదుముకున్నాడు జనార్దనరావు.

'వెధవ కాడిలాక్ కారు ఎవడిక్కావాలి ? —బంగారంలాంటి బుజ్జిగాడు కావాలి— అంతరాత్మరావు గోలపెట్టాడు'

నోర్ముయ్ - పాలడబ్బాకు గతిలేదుగానీ— బుజ్జిగాడుకావాలిట—బుజ్జిగాడు—కేకలేసాడు మరో జనార్దనరావు. వాడు హాయిగా ప్లిమత్ కార్లలో తిరుగుతూంటే నీకు మాత్రం ఆనందంకాదూ ?— నీ పుత్ర ప్రేమకు పరమావధి వాళ్లను ఆకలిత్తో చంపడం కాదు ఆనందంతో వాళ్లు తులదూగేలా చూడటం - ఈ మాత్రం అర్థంచేసుకోలేవూ ?—

తల వంచుకున్నాడు జనార్దనరావు—

'జనార్దనం ది 'టూ' నువ్వేనోయ్ కరక్టయిన మనిషివి —' అంటూ గొణుక్కున్నాడు.

*   *   *

మరో వారంరోజులు గడిచిపోయాయి. క్లాసిఫైడ్ ఎడ్వర్టయిజుమెంట్ల కాలములో జనార్దనరావు ప్రకటన పడింది. గుండెలు తడబడుతూండగా ప్రకటనను ఆసాంతం మళ్ళీ చదువుకున్నాడు జనార్దనం.

ఈ పాటికి ఈ ప్రకటనను దేశంలో లక్షలాదిమంది జనం చూచేవుంటారు. ఎంతోమంది కోటీశ్వరులు ఈ ప్రకటన చూచి 'ఏంచేద్దాం ? —' అని ఆలోచిస్తూ వుంటారు బిర్లాలు—దాల్మియాలు—ఎందరెందరో ఈ ప్రకటనగురించి చర్చిస్తూ వుంటారు — మిత్రులతోటి. అవునుమరి — వాళ్ల బాధలూ, తాపత్రయాలూ వాళ్లవి.

భారంగా నిట్టూర్చాడు జనార్దనం.

బుజ్జిగాడికోసం ఒకేఒక కోటీశ్వరుడు వస్తే ఇబ్బందిలేదు. ఇచ్చెయ్యొచ్చు. కాని — ఇద్దరు ముగ్గురు కోటీశ్వరులు ఒకేసారి వచ్చి పోటీ బడితేనే ప్రమాదం. ప్చ్ !— దానిదేముంది ? — అలాంటి పరిస్థితులు వచ్చినప్పుడు ఎవరి టెండరు బాగుంటే వాళ్లకు ఇచ్చెయ్యడమే !—జోక్ బాగుందనిపించింది. కాని—ఎందుకో నవ్వురాలేదు. గుండెల్లో ఏదో ముల్లుగుచ్చుకున్నట్టనిపించింది. ఆ ముల్లు ఏదో ఎందుకు గుచ్చుకుందో జనార్దనానికి తెలుసు. కాని — అబ్బే — నాకేం తెలియదు — అన్నట్టు ధీమాగా వుందామని తాపత్రయ పడతాడు

గుండెల్లో బాధ కలుక్కుమంటూవుంటే— ఛ—ఛ—అది బాధకాదు—దానిబుద్దే అంత — అనుకుంటున్నానని తనని తను బుకా యించుకో బోతాడు—పూర్ ఫెలో !—

జనార్దనం ఇంటికి వెళ్లేసరికి సరోజిని బుజ్జిగాడివళ్లు కందిపోకుండా పౌడర్ రాస్తోంది.

అడుగుల చప్పుడు వినగానే తల్లితో బాటు బుజ్జిగాడుకూడా అటువేపుచూశాడు. తండ్రిని గుర్తు పట్టగలిగాడో ఏమో ఓసారి కాళ్లూ, చేతులూ ఆడించాడు. హాయిగా నవ్వాడు.

'మన బుజ్జిగాడు ఇవాళ హుషారుగా వున్నాడు. ఏడుపనేదే లేదు—' అంది సరోజిని భర్తతో—నవ్వుతూ.

జనార్దనం బుజ్జిగాడివేపు ఓక్షణం చూచి హఠాత్తుగా తల దించేసుకున్నాడు.

లేదు. లేదు. తను వాణ్ణి చూడకూడదు. వాడి బోసినవ్వు చూచి మురిసిపోకూడదు వాడిపై మమతలు పెంచుకోకూడదు. పెరిగిన మమతల్ని కూలద్రోయడం కష్టం. అది భరించలేడు తను. తను ఇప్పుడు ఎంతటి భయంకరమైన పరీక్ష ముందున్నదీ జనార్దనానికి తెలుసు. అయినా—తనను తాను నిగ్రహించుకోక తప్పదు,

'ఒరేయ్—బుజ్జిగా—నవ్వరా—నవ్వు—నిండుగా, హాయిగా నవ్వు—నీ జీవితమంతా పూలబాట కాబోతూందిరా. నువ్వు కోటీశ్వరుడవై లక్షల్లో మునిగి తేలుతావురా—పోనీరా— ఈ గుమాస్తాగాడి జీవితం ఏమైనా కాని—వీడిబ్రతుకు ఏమంటల్లోనైనా కలిసిపోనీ—కానీ— నువ్వుమాత్రం దర్జాగా వుంటావురా. నా కదే కావాలి జనార్దనం నాలుగోకొడుకు దురదృష్టవంతుడు కాడని ఊరందరిచేతా అనిపించాలి. నాకదొక్కటే కోరిక డోంట్ వర్రీమై బోయ్—నీకు మంచి ఫ్యూచరుంది—'

బరువెక్కిన గుండెల్ని చేత్తో తడుముకుంటూ కదిలిపోయాడు జనార్దనం

భర్త ప్రవర్తనకు నివ్వెర పోయింది సరోజిని. 'మళ్లీ ఇవ్వాళ ఆఫీసులో ఏదో గొడవ జరిగివుంటుంది—ఆఫీసరుతోటి—' అనుకుంటూ తనను తను సమాధాన పరుచుకుంది.

* * *

వారం రోజుల తర్వాత రాత్రి భోజనాల దగ్గర అడిగాడు జనార్దనం మామూలుగానే

'నాకోసం ఎవరయినా వచ్చారా?—'

అన్నం కలుపుకుంటున్న పెద్దకొడుకు రాము అన్నాడు—

'వచ్చాడు నాన్నా— మన కిరాణా కొట్టు సూర్యనారాయణ వచ్చాడు. వాడికి మనం చాలాబాకీ వున్నామట. కొంతయినా ఇవ్వకపోతే ఇక సామాన్లు ఇచ్చేదిలేదని గట్టిగా కేకలేసి పోయాడు—'

విసుక్కున్నాడు జనార్దనం. ఎడ్వర్టయిజుమెంటుచూచి ఎవరన్నా వచ్చారా అనే కుతూహలంతో—ఎంతో ఆశగా అడిగిన ప్రశ్నకు వచ్చిన సమాధానం అతగాడిని క్రుంగదీసింది.

'ఏడిశాడు—వాడికాక గోల ఎప్పుడూ వుండేదే — అంతకు మించి ఎవరూ రాలేదా?—'

పులుసు పోస్తున్న జనార్దనం తల్లి నర్సమ్మ అంది మనవడితోటి—

'సాయంత్రం ఎవడో సూటు వేసుకుని వచ్చాడు కదరా!—'

తల్లిమాటలు వినగానే మజ్జిగ అన్నం తింటున్న జనార్దనం గుండెలు వేగంగా స్పందించాయి. ఆత్రంగా 'ఎవరూ?—' అన్నాడు కొడుకు తోటి.

నవ్వుతూ అన్నాడు రాము—

'అబ్బే—వాడా—అత్తరు కంపెనీవాడు నాన్నా—మనకెందుకూ? — అక్కర్లేదు పొమ్మన్నాను—

మరోసారి ఆశా భంగం.

ఏదో భోజనం అయిందనిపించి జనార్దనం అరుగుమీద కూర్చున్నాడు.

లోపల చావిట్లో ముగ్గురు పిల్లలూ కొట్టుకుంటున్నారు. రణగొణ ధ్వని వినబడుతోంది. రెండోవాడికి సంగ్రామంలో కొంచెం హెచ్చు మోతాదులో దెబ్బలు తగలడంతో పెంకులు ఎగిరి పోయేలా ఏడుపు ప్రారంభించాడు. ఇంతలో ఐక్యరాజ్య సమితిలాగా జనార్దనం తల్లి నర్సమ్మ రణ రంగంలో ప్రవేశించడంతో తాత్కాలికంగా యుద్ధ విరమణ జరిగింది. ఇంతలోనే నేపథ్య సంగీతం ప్రారంభమైంది. ఈ అల్లరికి మేలొన్న బుజ్జిగాడు గుక్కపట్టి ఏడుస్తున్నాడు.

ఛ. ఏడుపు. ఏడుపు. ఏడుపు కొంపలో ఎప్పుడూ ఏడుపే ఏదో ఓ ఏడుపు.

గట్టిగా చెవులు మూసుకుని ఆలోచనా సముద్రంలో బోట్‌షికార్ ప్రారంభించాడు జనార్దనం — ఏడుపుకి దూరంగా పారిపోయేందుకు.

ఏమిటీ గమ్మత్తు ? — లోకంలోని కోటీశ్వరు లందరికీ పిల్లలు పుట్టారా? లోకంలో పిల్లలు కావాల్సిన శ్రీమంతులే కరువైపోయారా ?—ఏం దేశమయ్యా ఇది—ప్రతిదానికీ కరువేనా ఇక్కడ !—

అబద్ధం—ఒప్పుకోడు తను— పిల్లలు లేనివాళ్లు లేకపోయినట్టయితే మనదేశపు జనాభా ఇంకా చాలా పెరిగిపోయి వుండేది



'ప్రశ్నావళి' శీర్షికకి ప్రశ్నలను పంపేవారు కవరుమీద స్పష్టంగా 'ప్రశ్నావళి,' ఆంధ్ర సచిత్ర వార పత్రిక, మద్రాసు — 1.' అని వ్రాయకోరుతున్నాము — సం॥







# నాలుగో వాడు

—దేర్‌ఫోర్ — పిల్లలు లేనివాళ్ళకూడా వుండితీరాలి. అయితే-వాళ్ళ కోటీశ్వరులు కావాలని ఎక్కడుందీ ?—

లిటిగేషన్ అంతా అక్కడే వుంది — అనుకున్నాడు జనార్దనం చార్‌మీనార్ ముట్టిస్తూ.

వెధవర్వెళ్ళు. ఎంత ఆలస్యంగావచ్చినా — కనీసం తనకి ఈ పాటికి ఓ అరడజను వుత్తరాలయినా వచ్చిఉండాలి. తనేగనుక పిల్లలులేని కోటీశ్వరుడయి వుంటే—ఎడ్వర్టయిజుమెంటు చూచికూడా ఇంత లేజీగా వుండేవాడా అని !-

ఛ - ఛ — ఏంలోకమయ్యా ఇది ?— బంగారు బొమ్మలాంటి—పనసపండులాంటి పిల్లాణ్ణి ఇస్తామంటే ఒక్కడూ మాట్లాడడూ ?— ఏం మనుష్యులయ్యా మీరు— అందుకే మిమ్మల్ని 'డబ్బున్నవాళ్ళ' అన్నారు.

దూరంగా ఆకుపచ్చరంగు ప్లిమత్‌కారు వెడుతోంది. వెధవది. ప్లిమత్‌కు ఆకుపచ్చ రంగు కన్నా నీలంరంగు చాలా బాగుంటుంది. మా బుజ్జిగాణ్ణి పెంచుకునే కోటీశ్వరుణ్ణి అలాంటికారు కొనమంటాను —అనుకున్నాడు జనార్దనం సిగరెట్‌దమ్ము లాగుతూ.

ఇంతలో హఠాత్తుగా లేత నీలంరంగు ప్లిమత్‌కారు జనార్దనం ఇంటిముందు ఆగింది. కలా ?— నిజమా ?—అని కళ్ళు నులుముకు చూసుకున్నాడు జనార్దనం. నిజంగా కోటీశ్వరుడు దిగివచ్చేశాడా ?— నమ్మలేనట్టు చూశాడు. అందులోంచి ఓ సూట్‌వాలా దిగాడు. అరుగుమీద స్థాణువులాకూర్చున్న జనార్దనాన్ని పలుకరిస్తూ అన్నాడతడు—

'చూడండి సార్ — సేఠ్ గంగారామ్ చందన్ మల్‌గారి ఇల్లెక్కడో చెప్పగలరా ?—'

ఒక్కసారిగా కొండమీదనించి క్రిందకు తోసేసినట్లయింది. వల్ల మాలిన కోపం కూడా వచ్చింది.

'ఏమో—నాకేం తెలుసూ ?—బజార్లో ఎక్కడయినా అడగండి—' విసుక్కుంటూ ఆరిపోయిన సిగరెట్ పీకను అవతలకు పారేశాడు జనార్దనం.

గొణుక్కుంటూ — సూట్‌వాలా - కదిలి పోయాడు.

వీడి ఎడ్రెస్ ఎంక్వయిరి తగిలెయ్య! ఎంత డ్రామా క్రియేట్ చేశాడూ ?—అసలు బుజ్జిగాడికి కోటీశ్వరుడయ్యే యోగం వున్నట్టు లేదు. నాలుగోవాడన్నందుకు చివరకు అదృష్టంలో కూడా నాలుగోవాడే అవుతాడేమో !—

శనివెధవ ఎప్పుడూ ఏడుస్తూనే వుంటాడు. వాడి ఏడుపులోనే వుంది దరిద్రం అంతానూ—తిట్టుకుంటూ గొణుక్కున్నాడు జనార్దనం.

* * *

రోజులు గడుస్తున్న కొద్దీ జనార్దనం ఆతృత క్రమక్రమంగా పెరిగి—ఆ తర్వాత దిగజారి పోవడం ప్రారంభించింది.

ప్రతీరోజూ పోస్ట్‌కోసం ఎదురు చూసి చూసీ, నాకోసం ఎవరన్నా వచ్చారా అని ఇంట్లో అడిగి అడిగీ, విసిగి వేసారెత్తి పోయాడు జనార్దనం.

ఇలా వుండగా — నిజంగానే ఓసారి జనార్దనం కోసం ఒక మోటారు బండి వచ్చింది. అందులోంచి ఇద్దరు సూట్‌వాలాలు దిగారు.

వాళ్ళను చూడగానే—ఆశలు అణగారిపోయిన జనార్దనం—

'ఎవరిల్లు కావాలి ?—' అని అడిగాడు యాదాలాపంగా. ఓ సూట్‌వాలా మాట్లాడాడు—

'జనార్దనంగారి ఇల్లు ఇదే అనుకుంటాను. డోర్‌నెంబర్ సరిపోయింది వారున్నారా ?—'

జనార్దనం కళ్ళల్లో థౌజెండ్ కేండిల్ బల్బు వెలిగింది తడబడుతూ అన్నాడు—

'జనార్దనాన్ని నేనే—మరి, మీరు...'

సూట్‌వాలా సమాధానం చెప్పాడు—

'నమస్కారం. నాపేరు రమేష్. మిగతా వివరాలు తర్వాత చెబుతాను మీరు పదిహేను రోజుల క్రితం పేపర్లో ఎడ్వర్టయిజుమెంటు వేయించారు కదూ!—'

జనార్దనం గుండెలు వేగంగా స్పందించాయి.

'అవును...' అన్నాడు బొంగురు పోయిన గొంతుకతో—

'**ఆ అబ్బాయి ?—**'

'**మావాడే. బుజ్జిగాడు. చాలా బొజ్జిగా వుంటాడు. రండి. రండి. చూపిస్తాను.**

ఇంతకీ మీ రెక్కడివారు ?— ఏం చేస్తూంటారు ?—' ఆత్రంగా జనార్దనం ప్రశ్నల వర్షాన్ని కురిపించాడు.

'అన్నిటికీ సమాధానం చెబుతాం— మీతో కొంచెం ఏకాంతంగా మాట్లాడాలి—'

'ఫర్వాలేదు. మాట్లాడండి—' అన్నాడు జనార్దనం కొంచెం గంభీరంగా— నిండుగా —హుందాగా—

'మేము మీ ఎడ్వర్టయిజుమెంటు చూసే వచ్చాం. అయితే—మీ అబ్బాయిని పెంచుకోడానికి కాదు—' సరాసరి అసలు విషయంలోకి వచ్చేస్తున్నాడా పెద్దమనిషి.

'మరి ?' అన్నాడు జనార్దనం ముక్కుపుటాలు ఎగరేస్తూ.

'మేము—ఫేమిలీ ప్లానింగ్ విషయమై కృషి చేస్తున్న ఒక రిసెర్చి ఇన్స్టిట్యూట్ ఆఫీసర్లం మా సర్వే కార్యక్రమాలకోసం ఈ వూరు వచ్చినప్పుడు ఎవరో మాకు ఈ ఎడ్వర్టయిజమెంటు విషయం చెప్పారు. అందుచేత కేస్ స్టడీ చేద్దామని వచ్చాం. ఎంతమంది పిల్లలు మీకు ?—ఏ పరిస్థితుల్లో మీరీ దత్తతకు సంసిద్ధులయ్యారు ?—పిల్లవాణ్ణి దత్తత తీసుకునేందుకు ఎంతమంది వచ్చారు ?—ఇవి మీ వ్యక్తిగత విషయాలైనప్పటికీ — దయచేసి సమాధానం చెప్పాల్సిందిగా కోరుతున్నాం. మాది కేవలం విద్యాసంబంధమైన ఆసక్తి మాత్రమే. పరిశోధనకు మాత్రమే మీ సమాధానాల నుపయోగిస్తాం—మీరు అన్యథా భావించకండి—'

జనార్దనానికి భూమంతా గిర్రున తిరుగుతున్నట్టనిపించింది. ఎన్నో ఆశలు పెట్టుకుని ఎడ్వర్టయిజుమెంటు వేయించాడు తను. ఎంతోమంది కోటీశ్వరులు పోటీబడి వస్తారనుకున్నాడు. ఎన్నెన్నో అందమైన కలలు గన్నాడు చివరకు వచ్చింది వీళ్ళు—ఫేమిలీ ప్లానింగువాళ్ళు.

మైడియర్ జనార్దనరావ్—నీ కొడుకు కోటీశ్వరుడు కాలేదుగానీ—నువ్వు మాత్రం నవ్వుల పాలయ్యావు. రేపొద్దున నీకథ అంతా ప్రతి పేపర్లోనూ బాక్సు కట్టి ప్రింటు చేస్తారు ఫేమిలీ ప్లానింగువాళ్ళు నీ కథను ఎడ్వర్టయిజుమెంటుకు ఉపయోగించు కుంటారు. నీ జీవితంమీద నువ్వే ఒక గొప్ప ప్రాక్టికల్ జోక్ వేసుకున్నావు. జీవితానుభవంలో ఇంత పెద్ద సర్వీసున్న పెద్దమనిషివి చివరికి ఎలా తయారయ్యావోయ్ — విరగబడి నవ్వాడు అంతరాత్మారావు.

'—ఏడిశావ్లే మనిషికి ఆశలుండటం తప్పా ? — ఆశకోసం ప్రయత్నించటం తప్పా ? — లాటరీ టికెట్ ఎందుకు కొంటావు నువ్వు ?—రికమెండేషను లేందే ఉద్యోగం రాదని తెలిసికూడా అప్లికేషను ఎందుకు పెడతావు నువ్వు ?—శుభకార్యానికి ముహూర్తం మెందుకు పెడతావు నువ్వు ?—

ఆశలూ — సెంటిమెంట్లూ — లేకపోతే మనిషే కాడోయ్. కాపోతే — అవి నాకు కొంచెం హెచ్చు మోతాదులో వున్నాయి. అందుకే — బుజ్జిగాడు జీవితం మీద లాటరీ టికెట్టు వేశాను పోతే పోనియ్ —ఈ మాత్రం దానికి నీకంత నవ్వు ఎందుకొస్తోందో నా కర్థం కావటంలేదు—'

ధైర్యం కూడబలుక్కుని అంతరాత్మారావు మీద కళ్ళెర్రజేసాడు జనార్దనరావు.

సరే — మొత్తంమీద తలప్రాణం తోకకు తెచ్చుకుని వాళ్ళను పంపించేశాడు జనార్దనం.

వాళ్ళు అటు కదలగానే — సరోజిని అన్నది భర్తతో—

'దత్తత అంటున్నా రేమిటి ?—'

పచ్చి వెలక్కాయ గొంతులో పడ్డట్టయింది జనార్దనానికి.

'అబ్బెబ్బె—ఏమీలేదూ — వాళ్ళమొహం. ఎవరిదో ఇల్లనుకుని మనింటికి వచ్చారు. ఈ యిల్లు కాదని చెప్పి పంపేశాను—'

అంటూ ఒప్పజెప్పినట్లు సమాధానం చెప్పి— భారంగా నిట్టూరుస్తూ — తల్లి వడిలో హాయిగా నిద్రపోతున్న బుజ్జిగాడి బొజ్జి బుగ్గలమీద చిటిక వేశాడు జనార్దనం.

'ఉహుఁ!— లేస్తాడండీ—' నవ్వుతూ అంది సరోజిని.

'లేస్తే లేచాడులే బోడివెధవ. వాడి నుదురు చూశావా ?— ఎంత విశాలంగా వుందో!— గొప్ప జీనియస్ అయిపోతాడే వీడు చూస్తూండు — వీణ్ణి రాధాకృష్ణన్ అంతటివాణ్ణి చేసేస్తాను—' గుండెల్లోంచి వస్తున్నాయి జనార్దనానికి మాటలు.

హాయిగా నవ్వింది సరోజిని — మల్లెపువ్వులా

బొటనవేలు నోట్లో పెట్టుకొని హాయిగా నిద్రపోతున్న బుజ్జిగాణ్ణిచూస్తూ గొణుక్కున్నాడు జనార్దనం

'ఒరేయ్—బుజ్జీ నాలుగోవాడూ — నీకేం భయంలేదురా —నా దేహంలో చివరి రక్తపుబొట్టు వున్నంతవరకూ నీకేం ఫర్వాలేదు నిన్ను సర్ సి. వి రామన్ లాంటి వాణ్ణి చేసేస్తాను. హెచ్. జె. బాబాలాంటి జీనియస్సువి నువ్వు. బోడివెధవలు — నిన్ను వాళ్ళెవళ్ళో కోటీశ్వరులు పెంచుకునే దేమిటిరా ?— వాళ్ళకేం తెలుసురా ఈస్తటిక్సెన్స్ ? — వాళ్ళేం ఎరుగుదుర్రా నీ పాల బుగ్గల్లోని అమృత కలశాన్ని ?— డోంట్వర్రీ మై డియర్ బోయ్ నువ్వు నా రక్తానివి. నా గుండెల్లో కాక మరెక్కడుంటావు నువ్వు ?— నేను తిండి మానయినా నిన్ను చదివించుకుంటాను నామాట నిలబెట్టుకుంటాను. ఆఖరివాడివి కాబట్టి తప్పకుండా అదృష్టవంతుడివి—'

జనార్దనం గొణుగుడులో 'ఆఖరివాడు' అన్న మాటమాత్రం స్పష్టంగా వినబడింది సరోజినికి.

'ఇదెప్పటినించండోయ్ — ' అంది నవ్వుతూ —

'అదంతేలే—' మళ్ళి గొణుక్కున్నాడు జనార్దనం. ●

# సినిమా

## భయంకర్ అనే వ్యక్తికోసం గాలిస్తున్న కృష్ణ, గుమ్మడి

కృష్ణ అమెరికానుండి వచ్చారు రాగానే ప్రభాకరరెడ్డిని కలిసారు, అక్కడ్నుండి వేరుగా గుమ్మడి యింటికి వెళ్ళారు, అక్కడ గుమ్మడి దీర్ఘంగా ఆలోచిస్తూ ఇటు, అటు పచార్లు చేయడాన్నిగురించిన కృష్ణ 'గుడ్‌మార్నింగ్ సార్' అంటూ లోపలికి ప్రవేశించారు 'హలో ఏమిటి కొత్త సంగతులు? ఆ భయంకర్ జాడ యేమయినా తెలిసిందా?' అని గుమ్మడి వేసిన ప్రశ్నకు 'ఈసారి నాబారినుండి తప్పించుకోలేడుసార్ అతనికి సంబంధించిన భోగట్టాను సేకరించాను' అని జవాబిచ్చారు నేనూ అలాగే ఫీలవుతున్నాను, భయంకర్‌ను యెలాగయినా వట్టేదామనుకున్న సమయానికి మనకి మరొకడు తగిలాడు చూడు' అంటూ తనచేతిలోవున్న ఫోటోను కృష్ణకు అందించారు ఆ ఫోటోను చూచి కృష్ణ 'వీడుమాత్రం మనల్నించి తప్పించుకోగలడంటారా?' అంటూ వెళ్ళిపోతారు ఈ సన్నివేశం ఎందులోదనుకుంటున్నారు ఫల్గుణాపిక్చర్స్ అయ్యన్ మూర్తి దర్శకత్వంలో నిర్మిస్తున్న 'జగత్ కిలాడీలు' చిత్రంలోది, గుమ్మడిచేతిలోవున్న ఫొటో ఎవరిదిఅని మీరడుగుతారుగా-ఆఫోటో శ్రీ ఎస్ వి రంగారావుదే ఈ చిత్రంలో డిటెక్టివ్‌గా గుమ్మడి, ఆయనకు సహాయపడే వ్యక్తిగా కృష్ణ, పోలీసు కమీషనరుగా ప్రభాకరరెడ్డి నటిస్తున్నారు ఇతర ముఖ్యపాత్రలను ఎస్ వి రంగారావు, రాజబాబు, బాలకృష్ణ, వాణిశ్రీ, జి వరలక్ష్మి, మాలతి, నిర్మల పోషిస్తున్నారు విశ్వప్రసాద్ రచన చేసిన యీ క్రియం చిత్రంయొక్క ఛాయాగ్రహణాన్ని కన్నప్పన్, సంగీతాన్ని కోదండపాణి, ఆర్ట్సను



'టక్కరి దొంగ-చక్కటి చుక్క'లో విజయనిర్మల

బి ఎన్ కృష్ణ నిర్వహించారు ఏకామ్రేశ్వరావు, రాఘవులు నిర్మిస్తున్న యీ చిత్రం లక్ష్మీఫిలింస్ ద్వారా అతి త్వరలో విడుదల కానున్నది

* * *

కృష్ణ తన ప్రేయసి విజయనిర్మలను వెతుక్కుంటూ వస్తారు, విజయనిర్మల దాక్కుని అతని కాలికి తాడు బిగిస్తుంది.

కృష్ణ: అమ్మ దొంగా ఉచ్చులు బాగా నేర్చావే

విజయనిర్మల: అవును నిన్ను యిలా కట్టేయ్యకపోతే మళ్ళీ ఏ పిల్లమెడకో తాళి కడతానంటూ బయల్దేరతావుగా?

కృష్ణ: అదా సంగతి నా మనస్సు నీకు తెలీదా నీకుతప్ప నా హృదయంలో మరొకరికి చోటుంటుందా

విజయనిర్మల మరెవ్వరికయినా చోటిచ్చావా, మర్యాద దక్కదు

కృష్ణ అబ్బ. ఏయ్ రాడీపిల్లా! రా

# సినిమా డైరీ

● వి జి డి పిక్చర్స్ నిర్మించనున్న సాంఘిక చిత్రానికి శ్రీ భమిడిపాటి రాధాకృష్ణ, రచన సాగిస్తున్నారు శ్రీ ఎన్ టి రామారావు ప్రధాన పాత్రను పోషించనున్న యీ చిత్రాన్ని శ్రీ సి ఎస్ రాజు నిర్మిస్తున్నారు

● శ్రీ రాజు పిక్చర్స్ 'రాజసింహ' షూటింగు శారదా స్టుడియోలో జరిగింది వాణిశ్రీ కాంతారావు, గీతాంజలి, సత్యనారాయణ పాల్గొన్న దృశ్యాలను శ్రీ సుబ్బరామదాసు చిత్రీకరించారు

● శ్రీ నాగవల్లి పిక్చర్స్ నిర్మిస్తున్న 'జరిగిన కథ' షూటింగు భరణి స్టుడియోలో జరిగింది శ్రీ జగ్గయ్య, కృష్ణ, కాంచన, రాజనాలలకు సంబంధించిన సన్నివేశాలను శ్రీ బాబూరావు చిత్రీకరించారు

● శ్రీ కె వీరాచారి జయా ప్రొడక్షన్స్ బ్యానర్‌లో నిర్మిస్తున్న సాంఘిక చిత్రం యొక్క షూటింగు వాసూ స్టుడియోలో జరిగింది హరనాథ్, మాలవికి సంబంధించిన దృశ్యాలను దర్శకుడు శ్రీ రాధాకృష చిత్రీకరించారు.

● ప్రముఖ దర్శకుడు, నిర్మాత శ్రీ విఠలాచార్య కుమారుడు చిరంజీవి బి వి శ్రీనివాస్ మే 7న గృహస్థుడయ్యారు శ్రీ శ్రీనివాస్ పెండ్లికి మద్రాసు సినిమా రంగం అంతా తరలి వచ్చింది ఈమధ్య జరిగిన పెండ్లిండ్లలో యింత మందిని చూడడం యిక్కడే అనుకుంటాను

● నవభారత్ కంబైన్స్ 'ఉక్కుపిడుగు' చిత్రం యొక్క రికార్డింగు మే 5న విజయా గార్డెన్స్‌లో జరిగింది శ్రీ బాలసుబ్రహ్మణ్యం, శ్రీమతి సుశీల డ్యూయెట్‌కు శ్రీ సత్యం ట్యూన్ చేసారు

● 'చిలకాగోరింక' కథానాయకుడు, 'నేనంటేనేనే' ప్రతి నాయకుడు ప్రస్తుతం బిజీ నటులలో ఒకరయిన శ్రీ కృష్ణంరాజుకి శ్రీ ఎస్ ఆర్ కె డి పి వి వి ఎస్ కె ఎల్ కె రాజబహదూర్ గారి కుమార్తె చి సౌ సీతాదేవికి మే 10 వ తేదీన భీమవరం సమీపంలోని మొగల్తూరు కోటలో వైభవంగా వివాహం జరిగింది సినిమా పరిశ్రమలోని ప్రముఖులు అనేకమంది వివాహానికి హాజరై వధూవరులని ఆశీర్వదించారు

కన్నుల పండువయిన జీవితానికి
శ్రీకారం చుట్టవలసిన యువరాజుకు
ఆకన్నులే మూతపడటంతో
అంధకారమే మిగిలింది
ఎందుకని
అదే రహస్యం!

DVS
PRODUCTIONS

డి.వి.యస్. ప్రొడక్షన్స్

# గండికోట రహస్యం

VIJAYA

దర్శకత్వం
బి.విఠలాచార్య · 

నిర్మాత
డి.వి.యస్.రాజు

ఆంధ్ర: విజయ · నైజాం: ఉషా · సీడెడ్: జయలక్ష్మి · మైసూర్: పారిజాత్





'మామకు తగిన కోడలు'లో విజయనిర్మల.

'కదలడు–వదలడు' చిత్రమే సమాధానం యిస్తుంది. జయలలిత, విజయలలిత, రామకృష్ణ, సత్యనారాయణ, హేమలత ముఖ్య పాత్రలను పోషిస్తున్న యీ చిత్రానికి వేణు ఛాయాగ్రాహకుడు, టి. వి. రాజు సంగీత దర్శకుడు. నాగరాజన్ కళా దర్శకుడు, శ్రీయుతులు చిన్ని, సంపత్ ద్వయస్సు డైరెక్షన్‌లో చిత్రంలో కనిపించే నృత్యాలన్నీ నయనానందకరంగా వుండేట్లు చిత్రీకరించ బడ్డాయి. శ్రీ రామస్వామి నిర్మిస్తున్న యీ జానపద చిత్రాన్ని విజయా పిక్చర్స్ విడుదల చేస్తున్నారు.

### కె. ఆర్. విజయను గాఢంగా ప్రేమించిన బాలకృష్ణ

ప్రభాకరరెడ్డి గారి ఆఫీసులో శ్రీమతి కె ఆర్. విజయ టైపిస్టు, బాలకృష్ణ ప్యూనుగాను పని చేస్తుంటారు; అప్సరస లాంటి విజయను, కొంటె కోణంగి బాల కృష్ణ లవ్ చేస్తాడు, ఆ ప్రేమ ఎంత వరకు పోయిందో తెలుసా ? 'విజయా, విజయా' అని రాత్రింబవళ్లు కలవరించడం వరకు పోయింది. అంతేకాదు. కళ్లు మూసినా, కళ్లు తెరచినా ఆమె ప్రతిబింబమే కనపడసాగింది. బాలకృష్ణను విజయ ప్రేమించిందా? లేక అర్భకుడు పిచ్చి వాడులే అని జమ కట్టిందా? విజయ ఎవరు ? ఆమె ప్రభాకరరెడ్డి వద్ద పని చెయ్యాల్సిన అగత్యం యేమిటి? అనేడి ప్రశ్నలకు సమాధానం దొరకాలంటే శ్రీ ఆనందమోహన్ నిర్మిస్తున్న 'మామంచి అక్కయ్య' చిత్రం విడుదల కావలిసిందే. ఈ చిత్రం మలయాళ భాషలో 'ఉద్యోగస్థ' పేరిట విజయవంతంగా ప్రదర్శించింది. శ్రీ అధుర్తి నరసింహమూర్తి దర్శకత్వం నెరపుతున్న ఈ సాంఘిక చిత్రానికి శ్రీ కోదండపాణి సంగీత నిర్దేశకుడు. శ్రీ బి. ఎన్. కృష్ణ కళాదర్శకుడు. చిత్రం లోని ముఖ్యపాత్రలను ఎస్. వి. రంగారావు, శోభన్‌బాబు, కృష్ణ, పద్మనాభం, ప్రభాకరరెడ్డి, రాజబాబు, ధూళిపాళ, బాలకృష్ణ, కె. ఆర్. విజయ, రాజశ్రీ పోషిస్తున్నారు.

* * *

'దేవదాసు' 'చిరంజీవులు' 'కన్యాశుల్కం' చిత్రాలను నిర్మించిన శ్రీ డి. ఎల్. నారాయణ శ్రీ విశ్వనాథ సత్యనారాయణ విరచితంబైన 'ఏకవీర' ను తెరకెక్కిస్తున్నారు. డాక్టర్ సి. నారాయణరెడ్డి మాటలు వ్రాయడంలో నేర్పుని ఈ చిత్రంలో గమనించవచ్చు. శ్రీ సి. యస్. రావు డైరెక్టు చేస్తున్నారు. ముఖ్యపాత్రధారులయిన శ్రీ రామారావు, కాంతారావు, జమున, విజయలు కవి సృష్టించిన పాత్రల్లో జీవించారనే చెప్పవలసి వస్తుంది. ఈ రసమయ కావ్యకన్యను జ్యోతి పిక్చర్స్ విడుదల చేస్తారు. అతి త్వరలో మీకు దర్శనమివ్వబోతున్న ఈ చిత్రానికి శ్రీ మహదేవన్ సంగీతాన్ని సమర్పించారు. శ్రీ సత్యనారాయణ ఛాయా గ్రహణం. ఇప్పటికి 12 రీళ్లు పూర్తయింది. మిగతా షూటింగు జూన్ మొదటి వారానికి పూర్తి



దిగ్విజయా ఫిలింస్‌వారి సాంఘిక
చిత్రంలో విజయనిర్మల.

ప్రతాభినయం ప్రత్యేక ఆకర్షణగాగల యీ ప్రణయం చిత్రంలో విజయనిర్మల, విజయలలిత, రాజనాల, సత్యనారాయణ, త్యాగరాజు రాజబాబు ముఖ్యపాత్రలను ధరించారు; శ్రీ సత్యం సమకూర్చిన సంగీతం చిత్రానికి తగ్గ మోతాదులోవుండి, ప్రణయ చిత్రాలకు కావలసిన 'సస్పెన్స్, థ్రిల్లు'ను యేర్పరిచింది. యీ చిత్రాన్ని మీకు చూపించే బాధ్యతను పూర్ణాపిక్చర్స్ తీసుకున్నారు.

*　　　*　　　*

హరీష్ ప్రొడక్షన్స్‌వారు నిర్మిస్తున్న 'జాలి మనసులు' సాంఘికచిత్రంలో కృష్ణకుమారి, హరనాథ్ నాయికా నాయకులు. కథ శ్రీ డి. వి. జయరత్నం, మాటలు శ్రీమతి లత, దర్శకత్వం శ్రీ మానాపురం అప్పారావు, నిర్మాత శ్రీ జి. గోపీనాథ్, నిర్వహణ ఎస్. హెచ్. మదీనా. సైదాం, ఉషా ఫిలింస్ రిలీజ్.

—శ్రీనివాస్ ●

# పుస్తకాలు

## వైతాళికులు

ముద్దుకృష్ణ సంకలనం విశాలాంధ్ర పబ్లిసింగ్ హౌస్, ఏలూరు రోడ్డు, విజయవాడ—2 వెల సాదాప్రతి రు 5-00 మేలుప్రతి రు 6–00

విశ్వనాథ, కృష్ణశాస్త్రి, పింగళి,కాటూరి,శ్రీ శ్రీ వేదుల, కొడాలి మొదలయిన వారి పద్యాల సంకలనం 1935 మొదటిసారిగా ప్రచురణ అయిన దానికి ఇదీ ఏడవ ముద్రణ శ్రీ ముద్దుకృష్ణ పీఠిక, పద్యాలు రాసినవారి సంగ్రహ జీవితచరిత్రలు పాఠకులకు ఉపయోగపడుతాయి.

## అపరాజిత

కథాసంకలనం రచన శ్రీ వాకాటిపాండురంగరావ్ ఎమెస్కో పాకెట్‌సైజు 176 పేజీలు, వెల రు 2–00 యం శేషాచలం అండ్ కో, మచిలీపట్నం, మద్రాసు, సికింద్రాబాద్,

పది కథలు, పసందయిన శైలి, ఉపమలూ ఉత్ప్రేక్షల వైవిధ్యం ఇన్ని సుగుణాలు గల రచనా పాటవంతో పత్రికల ద్వారా సుపరిచితులు శ్రీ పాండురంగరావు ఈ రచయిత కథలను ఒక్క బిగిని చదువుకునేటందుకు అవకాశం కలిగిస్తున్నదీ సంపుటి

మొదటికథ 'అపరాజిత'కు అనుబంధం 'పరిపూర్ణ'ను కలిపి చదివినప్పుడే ఆ అందచందాలు వ్యక్తమవుతాయి 'వాళ్లముగ్గురు' ఆకార వికార రూపమైన వింతగాథ 'ఆర్ చక్రరావు' కృత్రిమంగా సాగింది 'ఎదురీత', 'మందీ—మల్లాక్కుడూ' చకచక చదివెయ్యగల చిట్టికదలు 'రాకన్ మానవుహాని వృద్ధులు' రంజకంగా వుంది అధికార మదోన్మత్తతను కళ్లకు కట్టినట్టు నిరూపిస్తాడు 'చిపౌరుడు' చివరిది 'కాటుక రేఖ—కళ్ళజోడూ' అసల కథ అనలేమని రచయితే చెప్పారు అన్నింటిలో 'సీతామామి' కథ చక్కటి జాతీయ భావాలతో ఎంచక్కా నడిచింది

ఈ సంకలనంలో గమనించతగిన విశేష మొకటి — లోగడ, ప్రఖ్యాత రచయిత ఈసఫ్ తన కథలన్నీ ఏది ఎట్టి పరిస్థితుల్లో ఎలా పుట్టుకొచ్చిందో, ప్రతి కథకూ ప్రారంభంలో ఒక్కొక్క చిన్న 'ప్రస్తావిక'ను రాస్తూ వచ్చాడు అదే టెక్నిక్‌ను మన పాండురంగరావు ఈసంపుటిలో అవలంబించారు ఒకవిధంగా ఇదీ తెలుగు కథా సాహిత్యానికి కొత్తదనమే అనాలి

—శివకుమారి

## ధర్మపథం

పద్యకావ్యం రచయిత శ్రీ చావలి సూర్య ప్రకాశరావు 28 పేజీలు 50 పైసలు, ప్రకాష్ పబ్లికేషన్స్, సాలూరు ●

## ఆటలు

# నల్లవారిని అణిచివేసే దక్షిణ ఆఫ్రికా

క్రీడారంగంలో జాతివిచక్షణ అనే రాక్షసి తిరిగి కనిపిస్తోంది డేవిస్‌కప్ పోటీలలో దక్షిణ ఆఫ్రికా పాల్గొనటం గురించి వివాదాలు పెరుగుతున్నాయి

ఇంటర్నేషనల్ లాన్ టెన్నిస్ ఫెడరేషన్ వారి వారి జనరల్ మీటింగు జూలయిలో జరుగపోతోంది ఈ మీటింగులో చర్చించే నిబంధన ఒకటి జాతివిచక్షణ అవలంబించే దేశాన్ని డేవిస్‌కప్ పోటీలలో పాల్గొననివ్వకుండా నిషేధించే అధికారాన్ని ఫెడరేషన్ కమిటీకి ఇచ్చే నిబంధన ఈ నిబంధనకి కావలసిన ఆమోదం లభించడం ఇంచుమించు ఖాయం, దక్షిణాఫ్రికా జాతి విచక్షణని అవలంబిస్తోంది కాబట్టి ఈ దేశం నిషేధించబడటమూ ఇంచ మించు ఖాయమే

ఇదంతా ముందు జరుగపోయేనాటి సంగతి ప్రస్తుతం డేవిస్‌కప్ పోటీలు జరుగుతూనే ఉన్నాయి తూర్పు జోన్‌లో భారతదేశం జపాన్‌తో ఫయినల్స్ ఆడింది యూరప్, అమెరికా ప్రాంతాల పోటీలలో ఎన్నో మాచ్‌లు ముగిశాయి అన్నీ ముగిసే దాకా కొత్త పోటీల ప్రసక్తి అనవసరం నిషేధాలు జరిగినా పయి సంవత్సరం జరగవలసిందే

యూరప్ జోన్‌లో తమలో ఒకరితో ఒకరు ఆడి తర్వాత దక్షిణ ఆఫ్రికాతో ఆడవలసి ఉన్న ఇద్దరు దేశాలవారు అలాగ ఆడము, అన్నారు దక్షిణాఫ్రికా పోటీలేకుండానే మూడవ రవుండ్ ప్రవేశించవచ్చు మరికొందరు కూడా ఆడకపోతే ఇబ్బంది కలిగించే పరిస్థితులు ఏర్పడుతాయి! దక్షిణ ఆఫ్రికా వారితో ఆడటం మానుకోమని తక్కినవారు అనవచ్చు

క్రీడారంగంలో రాజకీయాలకి తావులేదు, నిజమే, కాని, దక్షిణాఫ్రికాధోరణి ఏమీ బాగా లేదు ఆ దేశంలో నల్లవారు ఎవరూ వచ్చి ఆడరాదు ఎమ్ సి సి జట్టులో డి' ఓలివియరాని రానివ్వమని దక్షిణ ఆఫ్రికా వారు అన్న సంగతి అందరికీ తెలిసినదే దక్షిణ ఆఫ్రికా వారు ఇంత మూర్ఖంగా ప్రవర్తించి నప్పటికీ ఎమ్ సి సి వారు మాత్రం దక్షిణ ఆఫ్రికా బృందాన్ని ఇంగ్లండుకి పిలిచారు ఆ దేశంవారు మాత్రం తమ విధానాన్ని మానుకొనటం లేదు దక్షిణ ఆఫ్రికాలోని నల్లఆటగాళ్లు అన్ని రంగాలలోనూ తమ సామర్థ్యాన్ని చూపుతున్నారు వారికి ప్రభుత్వం వద్ద ప్రోత్సాహం మాత్రం లభించటంలేదు దక్షిణ ఆఫ్రికా క్రీడాబృందాలలో ఒక్క నల్లమనిషి కూడా ఉండటం లేదు

దక్షిణ ఆఫ్రికాని ప్రపంచంలోని తక్కిన దేశాలవారు క్రీడారంగంలోకి రానివ్వకుండా ఉంచే అవకాశాలు ఆదేశం విధానాల వల్ల మరింత పెరుగుతున్నాయి

—కె యస్ నరసింహన్




# న్యూఢిల్లీ లేఖ

(6 వ పేజీ తరువాయి)

ఈ దుబారా కర్చువల్ల ఢిల్లీ ప్రజలకి వచ్చేది ఏమిటి? నీటికొరత, విద్యుచ్ఛక్తి కొరత, కల్తీతిండి, కల్తీమందులు, క్రమంగా పెరిగిపోతున్న మురికి, ప్రపంచంలో ఎక్కడా కనిపించని ఒక రకం నాగరికత

పాఠశాలలకి గుడారాలు వాడుతూ ఉంటే అనవసరమయిన ఈ కట్టడాలు దేనికి?

ఇటీవలే ప్రధానమంత్రి మేడమ్ గాంధిగారు సంపద కొందరి చేతుల్లో నిలిచిపోతున్నదన్నారు, అభివృద్ధి సరిసమానంగా జరగడం లేదన్నారు, ముందు ఢిల్లీ సంగతిని పట్టించుకుని దేశం సంగతి తర్వాత చూసుకోవచ్చు దేశం మొత్తం కర్చు మీద ఢిల్లీలో ఇంత దండుగ దేనికి? ●

Edited, Printed and Published by S Radhakrishna at the Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1. Chief Editor, S. Sambhu Prasad.